శ్రీ ర స్తు.

# రాజలక్ష్మీప్రతాపచంద్ర విజయము.

( చరిత్రవిషయక నవల.

ప్రథమభాగము.

గ్రంథకర్త:
జె. ఆదినారాయణరెడ్డిగారు.

తాడిపత్రి దేశబంధు ముద్రణాలయమున
ముద్రింపబడినది.
1935

 [వెల రు 0-8-0

శ్రీ ర స్తు.

# రాజలక్ష్మీప్రతాపచంద్ర విజయము.

( చరిత్రవిషయక నవల. )



ప్రథమభాగము.



గ్రంథకర్త:
జె. ఆదినారాయణరెడ్డిగారు.



తాడిపత్రి దేశబంధు ముద్రణాలయమున
ముద్రింపబడినది.

1 9 3 5

 [వెల రు 0-8-0

# అంకితము

---

భక్తజన వరప్రదాననిరత బద్ధకంకణుండు, శ్రీ శివజటాజూట వాహినియగు పినాకినీనదితీర వాసియు నస్మదిష్ట దైవతంబగు శ్రీఅశ్వత్థనారాయణ స్వామివారికి నా యీకృతి భక్తితో సమర్పితము.

# పాఠకులకొక విజ్ఞప్తి.

ఆంధ్రభాషాభిమానులారా!

నేను గ్రంథము వ్రాయుట కిదియే తొలిప్రయత్నము. లోపభూయిష్ఠముగ నుండవచ్చునుగాన, తాము పఠించునప్పుడు గనబడినదోషంబులు నాకు దెలియబఱచిన ద్వితీయముద్రణమునందు సవరించుకొనుటయే గాక మీరు నాభాషాభివృద్ధికి మరింత తోడ్పడిన వారగుదురు.

జూటూరు.
30-4-35

ఇట్లు బుధజనవిధేయుడు,
గ్రంథకర్త.



శ్రీగణేశ శారదా గురుభ్యోనమః.

# రాజలక్ష్మి ప్రతాపచంద్ర విజయము.



## ప్రథమ భాగము.

### —♦ మొదటి ప్రకరణము. ♦—

శ్రీదేవికి నివాసయోగ్యంబై ధగధగాయమానంబుగా విరాజిల్లు శ్రీ మహారాష్ట్రదేశంబును పదుమూడవశతాబ్దంబున రామదేవుండను నృపాలుడుపరిపాలించుచుండెను. ఇతడు యాదవకులజుడు. ఈ భూసత్తముడు ధైర్యవితరణ గుణంబులయందు మిగుల వెన్నెకెక్కియుండెను.

ఆదేశంబునకురాజధాని దేవగిరిపట్టణము. ఆ నగరమధ్యంబున గోటకట్టబడియుండెను. పొడవు మూడుమైళ్లు, వెడల్పు రెండుమైళ్లుగలిగి మిగుల బలిష్టమై యాకోట సురాసురులకుగూడ నభేద్యమై

యుండెను. ఆకోటలోపలనే గొప్పగొప్పయుద్యోగు లును, రాజును, ప్రధానులును, ధనవంతులును నివ సించియుండిరి. దుర్గము వెలుపల బీదజనులు గృహం బులు నిర్మించుకొని కాపురము జేయుచుండిరి.

ఆనగరరాజమునకు పశ్చిమదిగ్భాగంబున నాలు గుమైళ్లదూరంబున నొకయరణ్యంబుగలదు. అదిగొప్ప వృక్షంబులవలన నిబడీకృతమై చూపరులకు భయము కలిగించుచుండెను. ఆయడవి దేవదారు, టేకు, చం దనము, రసాలసాలంబులవలనను, జముడు, చపాత్షి, తుమ్మ మొదలగు ముండ్లచెట్లతోడను దట్టముగా నా వరింప బడియుండెను.

మనకథజరుగు కాలమునాటికి వేసవికాలంబు న నొకదినము సాయంత్రమునందొక యాశ్వికుడు తనహయంబు నారోహించి యావిపినమధ్యంబున వ చ్చుచుండెను. అప్పటికి పొద్దుగుంకు సమయమయి నప్పటికిని సూర్యుడాకాశమున తీక్ష్ణముగా నిప్పులుగు రియుచుండెను, కనుక నాతని యశ్వము మిగుల నలసియుండెను. అదికారణంబుగా నా తనిగుఱ్ఱము వడిగానడువలేకుండెనుగాని యతడాదుర్గ మారణ్యంబును గనుచీకటిపడువేళకు దాటవలెనను నూహతో దానినిచుఱుకుగా నదలించుచుండెను.

ఆ వీరుఁడు యిరువదినాలుగు వత్సరంబుల ప్రాయంబుగల సుందరుఁడు. చామనచాయ మేనితో వచ్చియురాని మీసంబులతో నాతడలరారుచుండెను. అతఁడు షరాయి, చొక్కాయి, కోటు, తలపాగ, వడిమికి డాలు, యొకపొడుగుపాటి కరవాలమునుధరించి, చూచుటకు శూరాగ్రేసరునివలెను, రాజకులజునివలెనునుండెను. అతనిశరీరముమిగుల బలిష్టమైనందున నాతని హయంబలసట జెందియుండినప్పటికిని నాతడుమాత్రమలసట జెందియుండలేదు. అతడటుల ప్రయాణము జేయుచుండగా భాస్కరుడపరాబ్ధిగ్రుంకెను. అప్పుడాకాంతారమునందు పక్షులు కలకల రావంబులతో శ్రావ్యంబుగా గూయుచు తమతమనివాసములను జేరుకొనుచుండెను. కలిమిలేములు కావడికుండలనునట్లు, యుష్ణమయుండగు దినకరుడస్తాద్రిని నస్తమింపగనే శీతమయుండగు హిమాంశు డుదయాద్రినుదయించెను. ఆదినము పౌర్ణమియగుటచే వెన్నెల పాలారబోసి నటులుండెను. మందమారుతములు హృద్యముగా వీచుచుండెను. మనరౌతునకు ప్రయాణమలసటలేకుండా జరుగుచుండెను, కానియదేవిధముగా ప్రయాణమధిక కాలము జరుగలేదు. ఒకజాముఱాత్రి గడచినతర్వాత నుత్త

రముదిశ కొన్ని మేఘములు దట్టముగా నావరించుకొనె
ను. పిమ్మటనుత్తరపుగాలి విశేషముగా వీవదొడగె
ను. త్వరలోనే యాజీమూతము లాకాశమంతటను
గ్రమ్ముకొని వర్షబిందువులు బడ మొదలిడెను. ఇది
వరకు నాకాంతాగమును దాటవలయునని సంకల్పిం
చుకొనియున్న మనయోధుడు తనతలంపు మార్చుకొని
యెచ్చటనైనా తలదాచుకొనుటకు స్థలముదొరకిన
చాలునని దిక్కులుపరికింపదొడగెను. అట్టిసమయం
బున నతడొక చిన్నగుట్ట సమీపమున బోవుచుండెను.
మేఘంబులుదట్టముగా నావరించియుండినందున నతని
కి నాలుగైదు బారలదూరముగూడ ద్రోవకనుబడలేదు.
అప్పుడతడు కంపాయమాన మానసుడై యెటుబోవుట
కును దోచక యొకచోటనిలువబడి నలుదిక్కులను చూ
చెను. అట్టిసమయంబున నంబరవీథిని మెఱపుమెర
య నాగుట్టమీదనొక గుడియుండునటులతనికి గన
బడెను. వర్షముతగ్గువరకా గుడిలో దాచుకొందమని
మనప్రియాణీకుడుతలంచి తనహయంబు నాగుట్టమీది
కి త్రిప్పెను గాని గుఱ్ఱమలసినందువలనను విశేషించి
గాఢాంధకారమావరించి వర్షము గురియుట చేతను యా
వీరుడెంత యదలించినను నదికదలదయ్యె. అప్పుడా
తడావారువంబునాయాసపెట్టు టుచితముగాదని క్రింది

కిదిగి దానినొకవృక్షంబునకుగట్టి తానొకడే యాదేవాలము దిశకుబోసాగెను. అతనికి దోవసరిగాకనబడనందునను, విశేషించియాగుట్టమీద ముండ్లచెట్లువిస్తారముగా నుండుటవలనను నాతనిపయనము సరిగాసాగలేదు. కాని యాతడుపట్టినపట్టువదలక ప్రయాసపడి యొకగడియకాలమగునప్పటికా గుడియొద్దజేరుకొనియెను.

ఆ గుడి పూర్వము మిగులయున్నతస్థితియందుండి నప్పటికిని నేడు (మనకథజరుగుకాలమునాటికి) మిగుల నీచస్థితియందున్నది. గుడిచుట్టునుండు ప్రాకారకుడ్యము లక్కడక్కడ శిధిలమైయుండెను. ప్రాకారము గోడలోపలగూడ ముండ్లచెట్లుదట్టముగా పెరిగియుండెను. దేవాలయము మాత్రమిప్పటికిని మంచిస్థితియందుండెను. మనయోధుడు దేవాలయము తలుపులను తెఱచుకొని లోపలకు బోయెను. అందు సీతారామలక్ష్మణుల విగ్రహములుండెను. అందులో నొకదిశయందు వంటచేసుకొనుటకొక పొయ్యికొన్నిమట్టిపాత్రలు కొన్నిసమిథలు నొకపాత్రయందుదకంబు నుండుటజూచి మనయోధుడు 'యీకికారణ్యంబులో నెవరు నివసించుచున్నారో'యని యాశ్చర్యపడెను. వర్షమప్పటికిని గురియుచునేయుండెను. మన తెరువరి

దేవాలయములో నాసీనుడై దీర్ఘాలోచనానిమగ్నుడై కొంత తడవుండినతరువాత తనలో "హా! అల్లాఉద్దీన సేనాధిప! నీవలనగదా మాకిట్టికష్టములుగలిగినవి. నీవుమారాష్ట్రింబుపైబడి మారాజ్యంబును రాజధాని నిదోచుకొనుటయేకాక, మాతలిదండ్రి సహోదరుల నందఱనుజంపి మాజయపురపుకోటను నేలకుదెచ్చితివిగదా. నీవుమనీపినతండ్రి జలాలుద్దీనుచక్రవర్తివలె గడుక్రూరుడవు. అతడుమంత్రిగానుండి తనయేలికనుదునిమి తాను పట్టాభిషిక్తుడయ్యెను. నీవు మాబోటి చిన్నరాజ్యములను రూపుమాపమొదలిడితివి. కటకటా! క్రూరచిత్తుడా! నాబొందెలో ప్రాణంబుండిన నాచేతనయినంత ప్రతీకారమును జేయకమానుదునా" యనితలపోయుచుండెను. ఇట్లుకొంతసేపుండినతరువాత వర్షమునిలిచి మబ్బువిచ్చిపోయి యాకాశమున విచ్చలవిడిగా పండువెన్నెలగాయుచుండెను. మనబాటసారి దనదుస్తులుతడియుటచే తలకుజుట్టుకొనినపాగా మొలకుగట్టుకొని, షరాయి, కోటు, చొక్కాయువిప్పి యారబెట్టుకొనెను. అవియారినతరువాత వాటినిధరించి పాగాగుడ్డనారబెట్టుకొనుచుండెను.

ఆసమయంబున ప్రాకారకుడ్యము వెలుపల నిరువురు మనుజులు మాటలాడిన శబ్దంబులాతని వీనుల

బడెను. ఆవీరుడాధ్వనిని నిదానంబుగా నాలకించి 'యీవచ్చువారు దుర్మార్గులో సన్మార్గులో'యని సందే హాడోలాయమాన మానసుడై దేవాలయములోనికి బోయి యెప్పటియటుల వాకిలి జేరవేసి విగ్రహము వెనుకభాగమున దాచుకొనియుండెను. ఆనూతనమ నుజులును దేవాలయములోనికివచ్చి యచట నొక దీ పముముట్టించి యీవిధంబుగాసంభాషింప దొడంగిరి.

ఒకటవ:— ఓరీ మహమ్మదలీ! మనమీ హిం దువులను యెంత శేగి టోపీ వేసితిమిరా! వారుపూర్తి యమాయికులు.

మహమ్మద్:— అటులగాదురా గులాముహు స్సేన్! వారంత తెలివిహీనులుగారు. మనముచాక చక్యముతో మెలగడమువలన వారికన్నులుమూసి, వారిసైన్యమునందుద్యోగములో ప్రవేశించి, వారిసైన్య ముయొక్క లెక్కయు, కోటయొక్క పటమును సంపా దించి,వాటిబలాబలములను కనుగొనగలిగితిమి.

గులాము:— ఔను మనమంత మేధావంతులము గనుకనే మనయల్లాఉద్దీను సేనాధిపుడు తనపరిజన మం తటియందును మనలనే యేరిపంపడము. ఇంకమనకు బహుమతులకే లోటు నుండదు.

మహమ్మద్:— మనము చేయవలసినపనులు

కొన్ని మిగిలియున్నవి. మనమా రాజుయొక్క ప్రధాను లలో కొందఱకు ఆశజూపి మనప్రక్కకు త్రిప్పుకొనవలయు ను. ఈకోటయొక్క పటమును, సైన్యము లెక్కయు, నే ను వ్రాయునుత్తరమును, ఢిల్లీకొకనమ్మకమైన మనుష్యుని చేతపంపి మనసేనాధిపునకిచ్చునటుల నేర్పాటుజేయ వలయును. అక్కడనుండి నేవయిన నుత్తరువులువచ్చిన యా యుత్తరువుల మేరకునడచుకొనవలయును. ఈ కోట మన స్వాధీనమైనప్పుడుగదా మనకోరికలు నెరవే రునది.

అనియిటుల మాటలాడుకొనుచు మహమ్మద లీ యనువాడు దీపము వెలుతురున నొక కాగితమును పెన్సలును బుచ్చుకొని అల్లావుద్దీను సేనాధిపున కొ క లేఖనులిఖించి యాకమ్మను, కోటయొక్కపటమును సైన్యపుసంఖ్య వ్రాసినకాగితమును నొకకట్టగట్టియుంచెను. మనప్రయాణికుడు విగ్రహము వెనుకగూర్చుండి, యా తురష్కద్వయము మాటలాడుమాటలను, చేయుచే ష్టలనుజూచి వారిదురభిప్రాయములను గ్రహించి, మ హాగ్రహపూరితమనస్కుడై కనులెఱ్ఱజేసి డాలుకు్రవే లాడుకరవాలముదూసి ముందరికి లంఘించి "ఓరో రీ మహమ్మదీయ కులపాంసులారా! బూరీపవిత్రమై న హిందూరాజ్యమును నాశనముచేయుటకు బూను

కొంటిరా! చెట్టుచెడుకాలమున కుక్కమూతిపిందె పుట్టునటుల, మీకు కాలము సమీపించినందుననే యి ట్టిదుర్బుద్ధులు పుట్టినవి” యనివారి నెదిరించెను. అ ప్పుడా యవనులిరువురు నాయోధుడు హఠాత్తుగా తమకు కనబడినందుల కాశ్చర్యపడుచు, తా ము నావీరునిమార్కొనుటకు కత్తులుదూసిరి. కానియం తలో మనయోధవరుడొకని శిరముఖండించి రెండవ వానినెదుర్కొనెను. అప్పుడువారిరువురును సరిసమా నముగా సమరముచేయదొడగిరి. కాని మనప్రియా ణీకుని యుద్ధకౌశలమునకు రెండవ వానిశక్తి తాళ జాలకపోయెను. అందువలనవాడు తడబడుచు సరి గా పోరలేకుండెను. ఇటు లరగంటసేపు ద్వంద యుద్ధముసల్పి రెండవతురష్కుధమునిగూడా తనఖడ్గ మున కాహుతిజేసెను. ఈవిధముగా నిరువురిని సమ యించి వారిసన్నిధికిజని వారుకట్టగట్టియుంచినకాగిద ములను సంగ్రహించి వాటినితనదాపున భద్రపరచు కొని, యికనేమైన రహస్యవస్తువులు దొరుకునను నాశచే వారియుడుపులుశోధించిచూచెనుగాని, వాటి యందు అతనికేమియుకనబడలేదు. అంతనతడుబయటి కివచ్చి కాలమెంతగడిచినదోయని చూచెను. అప్పటి కిని చంద్రుడాకాశమున ప్రకాసించుచుండెను.

సగమురాత్రిమీరియుండెను. మనప్రయాణీకుడచ్చట నే యానిశీథీశేషమును గడుపుటకిష్టపడక యాశ్వాధ రంబు దిగి తానుతొల్లివృక్షంబునకు గట్టియుంచినగుఱ్ఱ ము నొద్దకువచ్చెను. అదియునాతడా గుఱ్ఱనెక్కుట కమునుపు గట్టియుంచినచోటనే పండుకొనియుండెను. అతడు దానినిలేపి జీను మొదలయినవి సరిగానవరించి దానినారోహించి ప్రయాణముసాగించెను. ఇంతవర కలసటదీర్చుకొని యుండీనందున, యాఘోటకముగూ డ ననాయాసముగా నడువజొచ్చెను. ఇటులతడు దే వగిరిపట్టణము జేరునప్పటికి తెల్లవారుజామయి యానగ రవాసు లెల్లరును లేచితమతమకాల కృత్యములనుదీ ర్చుకొనుచుండిరి. అంతనతడొక సత్రంబునొద్ద తన గుఱ్ఱంబును గట్టివేసి యొకరూకకు గడ్డి నొకకృషికుని యొద్దగొనితెచ్చి దానిముందరవేసి తానుగూడనచ్చ టనే బసచేసెను.

## —♦ రెండవ ప్రకరణము. ♦—

మనబాటసారి, ప్రవేసించినదినముననే దేవగిరి పట్టణమున రాజసభ జరుగునని వదంతియుండెను. అందువలన రాజసభామంటపముగూడ చక్కగానలంకరింపబడియుండెను. ఆభవనము చక్కని స్ఫటికపురాతిచే గట్టబడి చూచుటకుగడు రమ్యముగానుండెను. ఆసభామందిరముయొక్క వెడల్పు ముప్పదిగజములు, పొడవు నలువదిగజములు గలిగి యాసభామంటప మొప్పారుచుండెను. దానికిరెండుద్వారము లమర్పబడియుండెను. ఒకద్వారమురాజు వచ్చుటకనుకూలముగా నుండునటుల రాజమందిరమువైపున కమర్పబడియుండెను. రెండవద్వారము బయటిజనులును నుద్యోగస్థులును వచ్చుటకనుకూలముగానుండి చూచుటకు మిక్కిలి మనోహరముగానుండెను.

మనకథ జరుగుకాలమునాటికి దేవగిరిపట్టణము మహారాష్ట్రకుంతల దేశంబులకు రాజధానిగానుండెను. ఆపట్టణంబును రామదేవుండను నృపశిఖామణి రాజ్యముచేయుచుండెను. అతనికప్పటికి నలుబదివత్సరముల వయస్సు. అతనికి సుసీలయనుభార్యయు, రాజలక్ష్మియను పదునారువత్సరంబుల ప్రాయంబుగల నొక కూతురును, శివదేవుడను నైదుసంవత్సరముల

యీడుగల పుత్రుడునుగలరు. రూపమునందు రాజలక్ష్మి సాక్షాదాదిలక్ష్మియే. ఆమెసోగకన్నులును, మందహాసము లొలుకు పెదవులును, ముద్దుమోమును, జూచిన యెంతటి జితేంద్రియునకుగూడ నామెపై మోహముకలుగక మానదు. భూపతి కాపుత్రికదప్ప వేఱుస్త్రీసంతతి లేనందున, నామెకు చదువునేర్పుటయే గాక కత్తిసాము గుఱ్ఱపుస్వారి మొదలగురణవిద్యలను గూడానేర్పి యుండెను. మఱియునానృపాలునకు చిత్రవర్మయను మంత్రిగలడు. అతడుమిక్కిలిబుద్ధిమంతుడు కనుకనే రాజుగూడా నతనిమాటప్రకారమే రాజ్యమును పరిపాలించుచుండెను. చంద్రసేనుడాతని సేనాని. అతడు బహుపరాక్రమధురీణుడై యనేకయుద్ధములందా భూపతినిగెలిపించి కృతకృత్యుడయ్యెను.

మొదటిప్రకరణమున జెప్పబడిన మనప్రయాణీకుడు దేవగిరిపట్టణము జేరినదినంబున బగలుపది గంటలకు రాజసభ జరుగుచుండెను. రామదేవుడు సింహాసనముమీద గూర్చుండియుండెను. భూపాలునకు కుడిభాగమున కుర్చీలమీద మంత్రియు, సేనాధిపతియు, దక్కిన యుద్యోగులును, వారివారియంతరువులకు దగినటులాసీనులయి యుండిరి. ఎడమభాగమునకుర్చీలమీద రాజబంధువులును, సామంతులును, వారివారి

యోగ్యతానుసారముగా గూర్చుండియుండిరి. ముందు వైపున వేయబడిన బెంచీలు నగరములోని పెద్దమనుష్యులతోడను, చూడవచ్చిన ప్రేక్షకులతోడను, నిండియుండెను. ఈవిధముగా సభదీరి రాచకార్యములను గురించివారంద ఱాలోచించుచుండిరి. అట్టిసమయంబున నొకసేవకుడువచ్చి రాజునకు నమస్కారముచేసి "దేవరా! ద్వారముయొద్ద నొకరసపుత్రవీరుడు మీదర్శనమునకై వేచియున్నాడు. తమశెలవైన బిలుచుకొనివచ్చెద" ననివిన్నవించెను. రాజాభటునివైపుజూచి యానూతనమనుజుని ప్రవేశబెట్టుమనెను. అతడునుపోయి యాశూరుని వెంటబిలుచుకొని వచ్చెను. ఆనూతనపురుషుడును నృపశిఖామణికి నమస్కారములుజేసి నిలువబడియుండెను. రాజాతని కొకయాసనముజూపించి యందతని గూర్చుండనియమించి యానూతన మానవునితో యీరీతిగా సంభాషించెను.

రాజు:— వీరుడా! నీపేరేమి?

యోధుడు:— మహరాజా! నాపేరు ప్రతాపచంద్రుడందురు.

రాజు:— మీరునివసించు స్థలమెయ్యది?

ప్రతాప:—రాజపుత్రస్థానమందలి జయపురము.

రాజు:— ప్రతాపచంద్రా! నీ చ రి త్ర ము,

నీవిందులకు విచ్చేయుటకుగల కారణంబుల నుడివిన మాకర్ణానందముగా నాలకింతుము.

ప్రతాప:— భూసత్తమా! ఈ దీనునిచరిత్ర చెప్పుటకు నోరాడుటలేదుగాని, మీ యాజ్ఞమేరకు వచించెద ఆలకింపుడు. జయపురపుకోటను జయచంద్రుడనురాజు పాలించుచుండెను. అతనికి నలువురు కొమరులుగలరు. అందుకడగొట్టువాడను నేను. జలాలుద్దీను ఢిల్లీసింహాసన మాక్రమించినపిదప అల్లాఉద్దీనను నతనియగ్రజుని పుత్రుడుసర్వసేనాధిపుడయ్యెను. అల్లాఉద్దీను కుటిలుడు, నత్యాశాపరుడును, సేనాధిపతి యయినతోడనే రాజ్యమును విస్తరింపజేయవలయునను దురాశ యాతనికి జనించెను. మారాజ్యమీతని యాశకుదొలికబలము. ఒకదినము హఠాత్తుగా ననంతసేనాసమేతుడై యాతడుమాకోటను ముట్టడించెను. మేముగూడా కోటతలుపులుబంధించియున్నసైన్యమును బ్రోగుజేసుకొని ముట్టడికినిలిచితిమి. ఇటుల నాలుగుమాసములు గడిచెను. శత్రువుల యాగడములు మెండాయెను. అరిబలంబులు దినదినమభివృద్ధిగాజొచ్చెను. మాకాహారము దినదినము క్షీణింపదొడగెను. తురుష్కులు మాకోటలోని కాహారము దెచ్చుకొనుటకు వీలులేకుండా దిక్కుదిక్కుల

కావలిగాయుచుండిరి. తుదకు నిరాహారులమై మరణింప వలసివచ్చునని యందరము నొకచోట గుమిగూడి బహిరంగయుద్ధమందు చచ్చుటే మేలనినిశ్చయించితిమి. తక్షణమే కోటలోని నారీమణులందరు చితిపేర్చుకొని, యందులో బడుటకు సంసిద్ధపడిరి. పురుషులందరముగూడి కోటగవినులు తెఱచుకొని హఠాత్తుగా మహమ్మదియ్య వాహినిపైబడి యుద్ధముచేయ దొడంగితిమి. శత్రువు లసంఖ్యాకులైనందున మేమెంతసైన్యమును జంపినను యదియిసుక పాతరవలె తరుగకయుండెను. మాబలంబులు మాత్రము పలుచబడజొచ్చెను. తుదకు మాతండ్రియు సహోదరులును, చనుమబడిరి. హతశేషులు పాఱిపోజొచ్చిరి. నేనొకడనే యుద్ధముజేయుటవలన ప్రయోజనములేదనియు, బ్రతికియుండిన నిదానముమీదనైనను పగదీర్చుకొనవచ్చునను నాశచేత తప్పించుకొని, యారాత్రికి మాపట్టణ సమీపంబుననున్న యొకయరణ్యంబు చేరితిని. ఆరాత్రి అక్కడనే శయనించి, తెల్లవారుజాముననేలేచి యచ్చటనే నొకసెలయేటిదగ్గర కాలకృత్యములనుదీర్చుకొని, నొకచోటగూర్చుండి యిటులాలోచింప దొడగితిని. “ఆహా కాలమా! నీవెంతలో మారితివి. క్షణములో లక్షాధికారులను భిక్షాధి

కారులుగను, భిక్షాధికారులను లక్షాధికారులుగను జే యు నీమహాత్వము నేడుగదా నాకు తెలిసినది. ఇప్పుడు నేనెచ్చటికిబోవలయునో నాకేగోచరింపకున్న దికదా. రసపుత్రస్థానమందలి మేవాడ్ దేశముతప్ప నన్నియుబలహీనములై, యీదినమో రేపో ఢిల్లీసుల్తా నుపాలబడనున్నవి. మేవాడ్ రాజ్యమునే చేరుదమనిన, మాతండ్రికి నాదేశమేలు రాణాకును ప్రాత వైరములుగలవు. ఢిల్లీసుల్తాను దాపుననేజేరి యేదో యొక యుద్యోగమునందు ప్రవేసింతమనిన, మాతండ్రిని నాసహోదరులనుజంపి నన్నీగతికి దెచ్చిన యీ పాపాత్ముని మరుగుజొచ్చుటకంటె కాలకూటవిషంబు నుదిని మరణించుటేమేలని నామనంబునకు దట్టినది. పైననుడివినవారుదప్ప నాకాశ్రయమిచ్చు వారెవరును వింధ్యోత్తరభాగంబున లేనందునను, నేనుదక్షిణహిందూదేశమునందుగల నరపాలురసభలలో మీయశఃకీర్తన లిదివఱకే వినియుండినందునను, మీరెక్కువవుదాతు లరనియు, యధికశక్తి సంపన్నులరనియు, మిక్కిప్రతాప వంతులరనియు దెలిసియుండినందునను, మీసన్నిధినేదో యొకయుద్యోగంబు సంపాదించుకొని మిగిలిన నాజీవితమును గడుపవలయునని నిశ్చయించుకొంటిని. అటుపిమ్మట నేను కొన్ని దినములవఱకు ప్రయాణము

సాగించి నిన్నటిరాత్రి యీపట్టణంబునకు పశ్చిమంబున నుండుకాంతారంబునం దేతెంచుచుండగా గొప్పవర్షము తగులుకొనెను. నేను తలదాచుకొనుటకు దిక్కులుజూడగా ప్రక్కనే గుట్టమీద నొకదేవాలయము గనబడెను. నే ననేకకష్టములుబడి తుదకా దేవాలయము జేరుకొంటిని. కొంతసేపటికా వర్షము తగ్గిపోయెను. నేను బయటికివచ్చి నావస్త్రములారబెట్టుకొనుచుండగా నాకునిరువురుమనుజులు మాటలాడిన శబ్దమువినవచ్చెను. నేను వారికంటబడిన నేయపాయము వాటిల్లునోయని మనంబున వెరగొంది యాగుడిలోనుండు విగ్రహము వెనుక జేరితిని. ఆవచ్చిన మానవులును గుడిలో నెవరును లేరనుకారణంబున విచ్చలవిడిగా మాటలాడదొడగిరి. వారిసంభాషణమునుబట్టి వారు ఢిల్లీసుల్తానునకు దూతలనితలంచి, యానీచాధములను మట్టుబెట్టి వారిదగ్గరనుండు కాగితములకట్టనుసంగ్రహించి, యవి మీరాజ్యమునకు సంబంధించినవగుటచే యిచ్చుటకి గొనివచ్చితిని. మీరు నన్నభిమానించి సాటిక్షత్రియకులజుని కాశ్రయ మియ్యవలయునను నుద్దేశముండినయెడల మిమ్ములనే నాశ్రయించియుండెదను. పొమ్మనిన పోయెదను.

ప్రతాపచంద్రుడీవిధముగా తనచరితంబంతయు

వచియించి తనదగ్గరనుండు కాగిదములకట్ట రాజునకొ సంగి యతని యానతినిబొంది తానాసీనుడయ్యెను. పిమ్మటనాక్ష్మాధీశుడా కాగితములన్నియు పరికించి తలయూపి వాటినన్నిటిని మంత్రియగు చిత్రవర్మచేతి కిచ్చి సభ్యులందరు వినునటుల చదువుమనెను. చిత్రవర్మ యాకాగిదంబులన్నియుజూచి యందొకకాగిదము నిటులజదివెను.

దే వ గి రి.

శ్రీమదఖండ భూమండలమేలు జలాలుద్దీను పాదుషా వారికినివారి సర్వసేనాధిపులగు అల్లాఉద్దీను గారి సముఖమునకు.

తమనిచాతి నీచసేవకులమగు మహమ్మదలీ గులాము హుస్సేనులు మనఃపూర్వకముగా సల్లాములు చేసి వ్రాసుకొన్నమనవి.

దేవా! మీయాజ్ఞప్రకారము మేము దేవగిరి పట్టణముజేరి యిచ్చటసైన్యమునందుద్యోగములో ప్రవేసించియున్నారము. మాయందెవరికిని ననుమానము లేకుండా మెలగి మాచాతుర్యమువలన యీకోట యొక్కపటమును, సైన్యముయొక్క లెక్కయు సంపాదింపగలిగితిమి. ఇవియొక నమ్మకమైన మనుజునివెంట మీకుబంపుచున్నారము. మీరుమాకేవైన నుత్త

రములువ్రాసి పంపవలసియున్న వీనివెంటనేపంపిన మా కుముట్టును. అందు లిఖింపబడు యుత్తరువులమేరకు మేము నడుచుకొనుచున్నాము.

ఇట్లుల మీసేవకులు,

మహమ్మదలీ గులాముహుస్సేను.

చిత్రవర్మ:— (ఈ విధముగజదివి) సభ్యులారా! మిగత కాగితములలో నొకటి మనకోటయొక్క పటము మఱియొకటి సైన్యముయొక్క బలాబలము ను సూచించుకాగితము.

రామదేవుడు:— సభికులారా! వింటిరిగదా యీ చిత్రమైన సమాచారములు. మనముకొత్తవారిని పరీక్షింపకుండా సైన్యమునందు జేర్చుకొను చుండుటవలననే యింతకీడు మూడినది. మనయదృష్టము మంచిదగుటవలనను పరమేశ్వరునివలె యీ రసపుత్ర వీరుడు వచ్చుటతటస్థించి నందునను మనము మహమ్మదీయుల కుట్రలుగనుగొంటిమి. ఇకమీద సైనను మనము జాగరూకత వహించుటమేలు.

చంద్రసేనుడు:— ఔను మీరనుడివినది వాస్తవము. ముందుమనము హెచ్చరికగా నుండనియెడల చెడిపోవుదుము.

రామ:— ఇప్పుడు మనము జేయవలసిన కర్త వ్యమేమి?

చిత్ర:— ఇప్పుడు మనముకనుగొనిన వార్తలవలన ఢిల్లీసుల్తాను మనరాజ్యముపైదండెత్తునని నాకుదోచుచున్నది గనుక మనము కోట పడిపోయినచోటుల మరమ్మతుజేసి బలపఱచుకొనవలయును. సైన్యమునందు క్రొత్తవారినిజేర్చి వారికి కవాతు మొదలగు యుద్ధవిద్యలను నేర్పవలయును. మంచి సమర్థులైన గూఢచారులను ఢిల్లీకంపి వారిరహస్యముల దెలిసికొనవలయును.

రామ:— మంచిది, మనకు సహాయముజేసి యిప్పుడు మననేత్రములు దెరిపించిన యీమహావీరునకు సైన్యశాఖలో యేబదిరూప్యముల నుద్యోగమిచ్చునటులేర్పాటు జేయవలయునని యిష్టపడియున్నాము. మీరందరితని సమాచారంబును వినియున్నారుగదా. మీయభిప్రాయమును దెలుపవలయును.

నృపవరుని వాక్యములకు సభికులందరు తమసమ్మతిని తెలుపగా నతడు ప్రతాపచంద్రుని కాయుద్యోగమిచ్చి యాంతరంగికసభ్యులలో నొకనిగ నేర్పాటుజేసెను. పిమ్మట కొన్ని రాజకీయ సమాచారములను మాటలాడిన తరువాత నాటిదినమునకు సభ విరమింపబడెను.

## —♦ మూడవ ప్రకరణము. ♦—

దేవగిరి రాజ్యమునకు ప్రధానమంత్రిగానున్న చిత్రవర్మకొక కొమరుడుండెను. అతనిపేరు రఘువర్మ. అతడు చదువునందును రణవిద్యయందును గడుప్రవీణు డు. అతడు నవమన్మధాకారుడు కాని యతనిగుణము లంతమంచివి కావు. అతడుమహాక్రూరుడు, జారుడు, చోరుడు. అతడు జనులను మిక్కిలి శ్రమబెట్టుచుండెను. అతనికి దగినటులతని మిత్రబృందముగూడ నట్టిదేయుండెను. ఆదుర్మార్గునిసమాచారము తండ్రియగు చిత్రవర్మకుగూడ తెలిసెనుగాని ఏకపుత్రుడగుటవలన యతనిని కఠినముగా శిక్షింపలేడయ్యెను. అప్పుడప్పుడతని క్రూరచర్యలు మితిమీరునప్పుడు మాత్రము కఠినముగా మందలించుచుండెను. ఈ మందలింపులతనిని సన్మార్గమునకు ద్రిప్పుటకుమారుగా మరింతదుర్మార్గమునకుదిప్పెను. ఈకారణములచేత మంత్రి యతివ్యాకులచిత్తుడయ్యెను.

రఘువర్మ తనమిత్రబృందముతో స్వగృహంబునగలిసిన తనజనకునివలన మాటలు వచ్చుననుకారణంబున, యాపట్టణమునకించుక దూరమునందు పాడుబడియుండు బౌద్ధదేవాలయమునందు కలియుచు

వచ్చెను. ఆబౌద్ధమందిరము పూర్వము మిగుల ఉన్నతస్థితియందుండినప్పటికిని యీకథజరుగుకాలమునాటికి పూజా, పునస్కారములులేక పాడుపడియుండెను. అందుకుకారణమేమన పూర్వకాలమునందుండిన బౌద్ధులందరు శంకరాచార్యులు, రామానుజాచార్యులు మొదలగు హిందూమత సంస్కర్తల మతబోధనలవలన హిందూమతమవలంబించిరి. అందువలన నాదేవాలయమేగాక దేశమందలి దాదాపుగా బౌద్ధాలయములన్నియు పాడుపడియుండెను. మనకథయందు నిరూపింపబడిన దేవాలయమప్పటికి కేవలము సిథిలముగానిస్థితియందుండెను. ఒక ప్రాకారము గోడమాత్రమక్కడక్కడ బడియుండె. అటనుండి లోనికిబోయిన యెడల నచ్చట కడువిశాలమైన బయలుండెను. ఆస్థలమధ్యంబున స్ఫటికపురాతిచే కట్టబడి బహుసుందరమైన బౌద్ధాలయముండెను. ప్రాకార కుడ్యంబులనానుకొని యనేక మఠములుండెను.

ఒకదినము సాయంతనము ముప్వురు మనుష్యులచట యెవరికొఱకో వేచియుండినటుల తోచుచుండెను. వారునవయౌవనులు, మహాబలసంపన్నులును నైయుండిరి. వారిచూపులు మహాక్రూరములై జూచువారికి భయముపుట్టించుచుండెను. వారిదగ్గర

యనేక నిశితాయుధములుగలవు. వారలొకరినొకరు బొగడుచు పరాక్రమములు బలుకుచుండిరి. వారిమధ్యంబున గొన్నివిదేశపు సారాయిసీసాలును త్రాగుటకు గ్లాసులు నుండెను.

ఒకటవ:— ఓరీరంగా! ఓరీగోవిందా! మనసహచరుడైన నీలు డిదివఱకు రాలేదేమి? ఆగణిక యిచ్చటికి వచ్చునో రాదోగదా?

రంగడు:— ఓరీనందా! భోగమువారికి ద్రవ్యమేగదా ప్రధానము. మనము వారికి సంతృప్తిగా ధనము నొసగిన వారెచ్చటికి రమ్మనిన నచ్చటికివచ్చెదరు. పగలువచ్చిన నందరు చూతురను కారణంబున వారు పొద్దుగునికిన తర్వాత రావలెనని నిశ్చయించి యుండవచ్చును.

గోవిందుడు:— సహచరులారా! మనప్రభువైన రఘువర్మ యీదిన మిదివరకు రానికారణము మనకు దెలియలేదుగదా?

రంగడు:— ఓరీ మీరెంతటి తెలివిహీనులురా! ఒకసమాచారమైన సరిగా నూహింపలేకున్నారు. మన మిత్రుడు మనతోగలసి తిరిగి చెడిపోవుచున్నాడని మనివిరోధులు కొందరు పెద్దమంత్రితో చెప్పినారట. ఆయన మనప్రభువును మందలించి యున్నాడట.

అందువలన మనప్రభువుగారు నిరంతరము మనతోకలసి మెలసి సంచరించుటకు సాధ్యములేదు గనుక యతడు గూడ పొద్దుగునికిన తర్వాతనే రావచ్చును. ఆ మహానుభావుని యాపుచేతనేగదా మన మింతవార మయినాము.

నందుడు:— ఓరీ! మనప్రభువుమీద చాడీలు చెప్పువారిని మనము కనిపెట్టి చంపినను నాకోపముపోదురా. వారికి కాలము సమీపించినందువలన వారు మన చెలికానిని జెనుక ప్రయత్నించుచున్నారు.

వారిటుల ముచ్చటలాడు కొనుచుండగనే దిన కరుడస్తమించెను. చీకటులు త్వరలోనే గ్రమ్ము కొనెను. నేడు కృష్ణపక్ష నవమి యగుటచే బయట గూడ గాడాంధకారముగా నుండెను. అపుడు గోవిం దుడు దేవాలయమునందు దీపమును వెలిగించెను. అట్టి సమయంబున వారికొక బండివచ్చిన శబ్దము విన వచ్చెను. వారునులేచి సింహద్వారము దగ్గరనిలువ బడి చూచుచుండిరి. కొంతసేపటి కొకశకటము వా రునిలిచియుండుచోటికి వచ్చినిలిచెను. ఆబండిలోనుం డి నవయౌవనాంగియగు సుందరాంగియు నైన జెప్పిన నలుడను వాడునుదిగిరి. వారా స్త్రీని దేవాలయము లోనికి బిలుచుకొని బోయిరి. అచ్చటవారా యువతిని

సౌందర్యమును దీపము వెలుగున జూచి యధికాశ్చ ర్యమగ్నమానసులైరి. ఆమెయే నూతనముగా దేవ గిరి నగరమునకు వచ్చిన వారవనిత. ఆయింతి యొ క్క కలకలలాడు మొగమును, ప్రకాశమానములైన కన్నులును, చిరునవ్వులొలుకు యధరములను జూచిన యెటువంటివానికైన మోహాముదయించుచుండ యీదు ర్మార్గుల సంగతి వేఱుచెప్పనేల. ఆగణికారత్నము బెనారిస్‌చీరగట్టి, మఖమల్ రవికదొడగి, ముఖమునకు పౌడరు వేసికొని శరీరమునకు ఘుమఘుమలాడు సెంటు పూసుకొని, కురులునున్నగదువ్వి, ప్రక్కపాపటదీసి, వాలుజడ వేసి, నొసటదిలకంబుదిద్ది, చూచువారికి భూలోకము నందవతరించిన రంభవలెనుండెను. మ నమిత్ర చతుష్టయ మాప్రాకారకుడ్యముల నానుకొ నియుండు నొకమఠమునందు దీపము వెలిగించి యామె నందు బ్రవేశబెట్టిరి. ఆమఠము బయటినుండిచూచు టకు శృంగారవిహీనముగా, గనబడినను, లోపల బహు రమ్యముగా నుండెను. నునుపుగార చేయబడి గోడలద్దము వలెనుండెను. అందు నేలమిగులసుందరమైన చలువరా ళ్లచేగప్పబడియుండెను. బయటయరయందు టేకుచెక్క లచే జేయబడినకుర్చీలు, బెంచీలు, మేజాలు, నుండెను. లోయరయందు హంసతూలికాతల్పంబును లేపుదిండు

మొదలగునవి శయనించుట కనువుగా నమర్పబడి యుం డెను. గోడలకు మన్మథలీలలనుదెలుపు వివిధపటము లు తగిలింపబడియుండెను. ఆగదియందే రఘువర్మ యిదివరలో ననేక కాంతలతో మన్మథక్రీడల తేలియాడి యుండెను. పైననుడివిన మిత్రచతుష్టయ మీ వా రకాంత నచ్చటబ్రివేశబెట్టి యామెకుదోడుగా బండి వానినచ్చటనునిచి, వారుమరల దేవాలయములోనికి బోయి యచట నందరుసుఖాసీనులై యీ విధముగా సంభాషించిరి.

రంగడు:—ఓరీ గీలా! యేమింత సేపుంటివి.

సీలుడు:— రంగా! నేను మనప్రభువుచెప్పిన చొప్పున మనమూలధనమునుండి వెయ్యిరూప్యములను దీసుకొని చంద్రికాంతయను వేశ్యగృహంబునకు బో యితిని. నేనామె సౌధమును జేరగనే దాసిమాత న న్ను సన్మానించి లోనికిబిలుచుకొనిబోయి నాసమా చారంబడిగి తెలుసుకొని నన్ను చంద్రికాంత యుండు గదియందు జేర్చెను. ఆహా! యేమిదానిమర్యాద! స హవాసము జేసిన యటువంటి దానితోడనే జేయవల యును. సాయంత్రముగానే నావార కాంతను ప్రయా ణము గమ్మంటిని. అదియు నాసమయంబున బో యిన నందరును నన్మానబడుదురనియు, పొద్దు

గ్రుంకినతరువాత బోవచ్చుననియుజెప్పెను. ఇంతలో నిను దస్తమింప నేనొకగుఱ్ఱపుబండి నద్దెకు బిలుచుకొనివచ్చి నాతినిబిలిచితిని. ఆ వెలయాలును వచ్చుటకు సిద్ధప డుచుండగా వేశ్యమాత యచటికివచ్చి పైకమిచ్చి మ రిపొమ్మనెను. నేనువెంటగొనిపోయిన వేయిరూప్యంబు లను నామె హస్తంబున గుప్పించి యా రమాలలా మనుబిలుచుకొని వచ్చితిని.

వారీవిధముగా ముచ్చటలాడుకొనుచుండగానే వారికి గుఱ్ఱపుడెక్కల శబ్దంబువినచ్చెను. వారునువా రి యజమానుడు వచ్చుచున్నాడని యనుకొనుచుండగ నే, గుఱ్ఱమునుబట్టుకొని యాతడే దేవాలయము లో నికి వచ్చెను. వారిలోనొకడా హయంబునుబట్టుకొని వృక్షంబునకుగట్టివేసి, యచ్చటనే యొకమూలనున్న గడ్డివామిలోనుండి కొంతగడ్డినిదెచ్చి దానిముందరవే సెను. పిమ్మట వారా దేవాలయములోని పడసాల లోగూర్చుండిరి.

రఘువర్మ:— మిత్రులారా! నిన్నటిదినమున మనముగలిసి యనుకొనిన పనులన్నియు కొరతలే కుండా నెరవేర్చుకొని వచ్చితిరా? ఎవరెవరికి యెం త ఫలితము.

రంగడు:— దేవా! మనగుంపునుండి యారుగురు

మనుజులను నా వెంట నిడుకొని దేవగిరి పట్టణము లో నొక వైశ్యుని గృహమునందు ప్రవేసించి, యత నిని యతని భార్యను నిద్రలోనే మంచములకు బంధించి, వారువాపోవకుండా గుడ్డలు నోటి యందు దురిగి, మోలలోని బీగముచెవులు దీసుకొని వారి యినుపపెట్టెను తెరచి, రెండువేల రూప్యములను కొన్ని బంగారు వెండి యాభరణములను దొంగిలించుకొని వచ్చి మనఖజానాలో వేసియున్నాను.

గోవిందుడు:— మంత్రినందనా! నేను మనగుంపునుండి యెనిమిది మంది మనుష్యులను బిలుచుకొని, యీ దేవగిరి పట్టణమునందలి బజారునందొక కొట్టుకు కన్నము వేసి, కొన్ని బియ్యము మూటలను, వక్కలు బెల్లము, కొబ్బెర మొదలగు దినుసులును, కొల్లలుగా దొంగిలి తెచ్చినాను.

నందుడు:— దేవా! మనగుంపునందలి యిరువది మంది శూరులను వెంబడినిడుకొని, యీ సమీపముననున్న పెద్దపల్లెయను గ్రామము మీదబడి, వడిసెలతో రాలతోరువ్వగా నాగ్రామవాసులందరు యిండ్లలో దూరుకొని తలుపులు బంధించిరి. తరువాత మేము ధనవంతుల గృహంబులన్నియు వరుసగా దోచుకొని వచ్చితిమి.

నీలుడు:— ప్రభూ! నే నిరువురవీరులను నా వెనువెంట బిలుచుకొని, యీ యరణ్యంబునందు గల దారులుగాచుకొని, వచ్చెడు స్త్రీ పురుషులను దోచుకొని, యాద్రవ్యంబును మన ఖజానాయందుంచినాను.

రఘువర్మ:— ఆహా! మీవంటి సేనాధిపులు నాకు లభించినందులకు తొలిజన్మంబున నేనెంత పుణ్యమారాధించియుంటినో గదా. మీకు చోరవిద్యయందుగల నైపుణ్యమును ధైర్యమును యాదిశేషునికిగూడ వర్ణింప సాధ్యపడదు గదా. మీవంటివారుండబట్టి నేను ధన్యుండనైతిని.

నందుడు:— దేవా! మీరు మాకు యజమానులైయుండ మమ్ముల నా త్రినేత్రుడుగూడ తేరిచూడజాలడు. మమ్ముల నీచోరవిద్యలందు నేర్పరులుగా జేసినది మీరేగదా. మేమిదివరలో చెదిరియుండి స్వల్పోద్యోగులకుగూడ భయపడుచుంటిమి. ఇప్పుడు మీకరుణవలన నొక గుంపుగా జేరితిమి. ముఖ్యముగా మీ ప్రాపుండడమువలన యుద్యోగస్థులటుండ రాజుగూడ మమ్మేమియు చేయజాలడు.

రఘువర్మ:— సఖులారా! నిన్నటిదినంబున నొక యాలోచన నామనంబునందుదయించినది. మన భూపాలునకు నొక బాలుడును నొకకూతురును గలరు.

ఆ యువిదయు మిగుల రూపవతి. నామనంబాయువిద యందుమార్తియున్నది. మఱియు నొకవిశేషంబుగలదు. నేను రాజునకు జామాతనైన రాజుగతింపగనే నాకు రాజ్యమువచ్చును. ఎటులైన నేను వివాహమాడిన తత్క్షణంబ యాబాలుని నేదోయొక తంత్రముబన్ని మడియింపవచ్చును. గనుక మనకిప్పుడుండు కొంచెముభయముగూడ నపుడుండదు. అప్పటికి మీకే మంత్రి దండనాధిపుల యుద్యోగముల నిచ్చెదను. మొదట మనమావనజదళాక్షిని లోబరుచుకొనుమార్గమును జూడవలయును. ఏలనన మాక్షత్రియులలో స్త్రీలయిష్టంబులకు వ్యతిరేకంబుగా వివాహములుగావు.

నీలుడు:— మంత్రికుమారా! మీరు రాజుకూతును గోరగానే యామె భాగ్యశాలినియయ్యెను. ఆ లేమ మీకంటె మంచివరుని యీలోకంబున బడయనేరదుగాని మనము గర్వంబున యావిషయంబునేమియు నాలోచన చేయకుండుట మంచిదిగాదు. మనము చేయవలసిన ప్రయత్నములు చేసియేతీరవలసినది. నా భార్య వివాహముగాకమునుపు రాజాంతఃపురములలో పరిచారికగానుండినది. మిగుల నేర్పరి. దానినే రాకుమారియొద్ద చెలికత్తెగాజేర్చి మీయభిలాషను వెల్లడించి మీమీద మనసుగలిగియుండునటుల జేయుమని

యచటికనిపెదను.

రఘువర్మ:— సహచరులారా! మన పట్టణము నకు నూతనముగా నొకవారకాంత వచ్చియున్నదనియు, నదియు మిక్కిలి సౌందర్యవతియనియు మీరు నుడివి యుంటిరి. దానిని బిలుచుకొనివచ్చితిరా?

నీలుడు:— దేవా! మీరాజ్ఞాపింపడము, యది నెఱవేరకుండ బోవడమునా? ఆవెలయాలిని బిలుచు కొనివచ్చి మీశయనమందిరమునందు ప్రవేశబెట్టి యా మెకుదోడుగా బండివానినిగూడ నందునిచినాము.

రఘువర్మ:— దానినిచ్చటికి రప్పింపుము. అప్పు డు వారిలో నిరువురుబోయి యారోవెలది నచటికిబిలు చుకొని వచ్చిరి. అదియువచ్చి రఘువర్మకు నమస్కరిం చి నిలుచుండెను. అతడాయువిదను గూర్చుండనియ మించెను. ఆస్త్రీయు మిగుల శృంగారవతిగాన మన మంత్రికుమారు నతిసులభముగా మోహపరవశునిజేసె ను. అతడాకాంతతో కొన్ని వేడుకమాటలు మాటలా డి, యాపూబోణిని కొంత సంగీతమునుజేసి, పిమ్మట నృత్యమునుజేయుమనెను. అదియు కొంచెముసేపు సం గీతమును నృత్యమునుజేసి, యాయమాత్యనందను నా నందాబ్ధిదేల్చెను. అతడును మోహపగవశుడై, తాను ధరించిన ముత్యాల హారంబును దాని మెడయందు

గీలించెను. అటుపిమ్మట నావారకాంత నృత్యమునునిలిపి యొకచోటగూరుచుండెను. అప్పుడారఘువర్మ యా వా ర కాం త తో మద్యంబును గ్లాసులలోఁబోసి యందరకు బంచిపెట్టుమన యదియు నటులనేజేసి తాను కూడ కొంత సేవించెను. మత్తు పూర్తి తలకెక్కగనే, మంత్రికుమారుడా వారవనితను జేయిపట్టుకొని, తన శయనమందిరమునకు గొంపోయెను. ఆ మిత్రిచతుష్ట య మచ్చటనే నేలమీద వస్త్రంబులు పఱచుకొని శ యనించిరి.

## —♦ నాలుగవ ప్రకరణము. ♦—

దేవగిరిపట్టణములో రాజాంతఃపురమునందు రాజనందనమైన రాజలక్ష్మి తన చెలికత్తెలతో ముచ్చటలాడుచు కాలముబుచ్చుచుండెను. రామదేవమహారాజునకామె తప్ప వే ఱాడుసంతతిలేనందున నతడామెను మిగుల గారాబముతో పోషించుచుండెను. అతడును నతనిభార్యయయిన సుశీలయు రాజలక్ష్మియడిగిన దేతడవుగా యసాధ్యమైనవస్తువులుకూడ సమకూర్చుచుండిరి. ఇటులల్లారు ముద్దుగా బెరిగిన యీామె యొకసంవత్సరము క్రిందటనే రజస్వాలయయ్యెను. రాజలక్ష్మి శరీర సౌందర్యము, నంతకంటె గుణసౌందర్యమును శీలమును సుప్రసిద్ధములైనందున ననేకరాజులు రామదేవునితో వియ్యమంద నిష్టపడి తమతమ పుత్రుల చిత్రపటములనుగూడ పంపియుండిరి. కాని నతడీకాలపు తల్లిదండ్రులవలె యీయధికారమును తనమీాదనుంచుకొనక తమ కొమరిత నెవరినిగోరిన వారికొసంగెదనని చెప్పుచుండెను. ఆ లలనారత్నమున కాపటములలో నొకదానియందుగూడ నిష్టములేదయ్యెను.

పైననుడివిన ప్రకారము రాజనందన తన చెలికత్తెలతో వేడుకలు సల్పుచుండగా ద్వారముదగ్గరనుండు సేవకురాలువచ్చి "అమ్మా! యెవరో యొకస్త్రీ తమ

దర్శనమునకు ద్వారముదగ్గర వేచియున్నది. తమ యుత్తరువయిన పిలుచుకొనివచ్చెద” నని చెప్పెను. అప్పుడు రాజలక్ష్మి తనకు మిక్కిలిగూర్చు చెలికత్తె యయిన కమలా, లలితలనుజూచి యామె యెవ్వరైయుండవచ్చునని యడిగెను. వారును “అమ్మాయి! తిన బోవుచు రుచులడుగనేల”యనిరి. ఆమెను ప్రవేశబెట్టుటకు రాజకుమారిత ముదలనిచ్చెను. అప్పుడు పరిచారికపోయి యామెను బిలుచుకొనివచ్చెను. ఆ నూతన స్త్రీ చూచుటకు ముప్పదివత్సరంబుల ప్రాయంబుగలిగి యుండెను. ఆమె కేవలమందకత్తెయుగాదు, కేవల మందవిహీనయుగాదు. కాని సూక్ష్మబుద్ధిగల రాజనందన కామెచూపులు గొంచెము కుటిలమైనవిగా గనబడుచుండెను. ఆయువిద యొక నడిపాతచీరయు నక్కడక్కడ చినిగినరవికెయు ధరించియుండుటవలన, తన బీదతనమును వెల్లడించుచుండెను. ఆమె యెవ్వరైనది మనపాఠకులూహించిన తెలుసుకొనగలరు. ఈయువిదయే మనకు చిరపరిచితుండగు నీలునిభార్య. అతడీమెను రాజకుమార్తె మంత్రినందనుని మోహించునటుల జేయుటకు బంపియుండెను. అటులాస్త్రీయచటికి వచ్చిన పిమ్మట, రాజలక్ష్మికి నమస్కారముజేసి నిలువబడియుండెను. రాజనందనయు నామెను గూర్చుండ

నియోగించి యిటులనియెను.

రాజ:— అమ్మా! మీరుండుస్థలమెయ్యది? ఇచ్చటికెందుకు విచ్చేసియున్నారు? మీచరితంబును పూర్ణంబుగా దెలిపిన వీనుల విందుగా వినెదము.

నూతనస్త్రీ:— అమ్మా! ఈ దీనురాలి చరిత్ర మీకు దెలుపుటకు నోరాడలేదు, కాని మీరాజ్ఞాపించి నందున మనవి జేసెదను. తల్లీ, మానివాసస్థలమిచ్చటి కెనిమిది యోజనంబుల దూరంబునగల యోధపురపట్టణము. మేమును క్షత్రియులమే. నా పేరు చపలాక్షి, నాభర్త యా దేశంబునేలు రాజునొద్ద నుద్యోగమునం దుండెను. అనగా యయిదునూర్ల కాల్బలములకు పౌజుదారుడుగా నుండెను. నానాథుని నారాజుతమ్మునిగా స్నేహవాత్సల్యములతో జూచుకొనుచుండెను. ఇటు లుండగా నారాజ భార్యయొద్ద కొందరు తామసులు క్రమముగా జేరుచువచ్చిరి. సాధారణముగా సజ్జనసహవాసముకంటె దుర్జనసాంగత్యము శీఘ్రముగా నలవడునుగదా. ఇటుల కొంతకాలము జరుగగా దుష్టులు రాజుమీద నతనికి ద్వేషబుద్ధిపుట్టించిరి. ఆటుతరువాత కొన్నిదినములకు నతడు భూవరునకు దెలియకుండ కొంత సైన్యము నేర్పాటుజేసుకొనెను. అప్పుడతడు తనయన్నతో యుద్ధముజేయుటకు నాపెనిమిటి సహాయ

ముగూడ గోరెను. నాభర్త తొలుత నాతని వారించి చూచెనుగాని, నతడు విననందుననను, స్నేహధర్మము చెడ్డదగుటచేతను, యాతనికిలోబడక తీరినదిగాదు. కొన్ని దినములు జరిగినతరువాత భూపాలుని తమ్ముఁడు సమయముజూచుకొని కోటను ముట్టడించెను. నృపాలుఁడును కోటవాకిండ్లుతీయించి, దండుతోబయలువెడలి, బహిరంగమున తమ్మునితోబెనగెను. సమయముజూచి నాభర్తయు తనక్రిందనున్న వాహినితో నృపసహోదరునివైపు దిరిగెను. అప్పటికిని భూపాలునిసైన్యమధికముగా నుండినందున అరిబలంబులు త్వరలోనే పలుచబడజొచ్చెను. ఇంతలోనే యొకయోధుఁడు రాజుతమ్మునితల నరికెను. కొందరు పాఱిపోవగా హతశేషులు నాభర్తతోగూడ రాజుచేత జిక్కిరి. కొన్నిదినములు జరిగినతరువాత రాజాహతశేషులనందరిని విచారించి, నాభర్తను రాజద్రోహమను నేరముక్రింద యావజ్జీవము కారాగారమున నుండునటుల శిక్షవిధించెను. నేను రాణిగారిదగ్గరకుబోయి నాపెనిమిటి నెటులయిన వదలించునటుల జేయవలసినదనియు, లేనియెడల యాగ్రామమున దిక్కులేనిదాన నగుదుననియు వేఁడుకొనగా, నామె నాప్రార్థన నిరాకరించి నన్నుబయటికి గెంటించెను. నేనును చేయునదేమియులేక శివ

డాయుని యింటికివచ్చి నా మగడు సంపాదించిన సంపదవలన నాలుగుమాసములు గడిపితిని. తరువాత నన్నెవరును విచారించువారు లేనందున, కూటికిని గుడ్డకును మొగమువాచి యీ దేవగిరికి రెండు క్రోసులదూరంబునగల యొకపల్లెలో నాపుట్టినిల్లుండుటచే నచటికిబోవ నిశ్చయించుకొని ప్రయాణమైతిని. పగలెల్లనడచియు, రాత్రిపూటనేదోయొక గ్రామంబున విశ్రమించియు, యెనిమిది దినములకు నాపుట్టినిల్లు చేరుకొంటిని. అచ్చటికి పోయినను నామనంబు కుదుటబడలేదు. స్త్రీలకత్తగారింటి దగ్గరనుండు స్వాతంత్ర్యము పుట్టినింటియొద్ద నుండదుకదా. మాయన్నగారేమో నన్నుమర్యాదగా విచారించుచుండిరిగాని, మావదినెగారికిని నాకును మైత్రిగుదురనందున నేనీ యస్వాతంత్ర్యపు బ్రతుకు బ్రతుకుటకంటె మరణించుటయే మేలనకొంటినిగాని, యెవరిప్రాణంబులు వారికి దీపుగదా. అందువలన నెచ్చటనైన నొకరి యింటిలో సేవకావృత్తియందు బ్రవేశించి జీవించుటయే మేలనితలంచి యీ పట్టణంబునకు వచ్చితిని. ఈ నగరంబునందు నన్నెవరైన యాదరించువారు గలరాయని విచారించగా, మీవంటి యుదారతయు బామరులమీద వాత్సల్యమునుగలవారు యీ

పట్టణమునలేరనియు, నన్నిచ్చటికి బొమ్మనియుచెప్పగా యిచ్చటికరుదెంచితిని. ఇదియే నాచరిత్ర. ఏదో యొకయనాథస్త్రీని రక్షించిన పుణ్యమును గలిగించుకొని న గలిగించుకొనుడు. లేక మీరక్కఱలేదనిన నాగ తి యెటులుండిన నటులగును.” అనియేదోయొకక ల్పిత కథజెప్పి కల్లబొల్లి యేడ్పుల నేడ్వసాగెను.

ఈ కథ వినినతరువాత రాజలక్ష్మికినామెచె లికత్తెలకును మనంబులుగరగి, యామెదీనావస్థకై మి గుల విచారపడిరి. అంతరాజకుమారి యామెనుగూడ యొకదాసిపనికి నియోగించి పోషింపసాగెను. చప లాక్షి యీ విధముగా బనికి గుదిరి తలలోనినాలుక వలె యెవరేపని జెప్పినను జేయుచు యందరివలన మె ప్పుబడసెను. రాజలక్ష్మిగూడ యామెనుమిగుల ద యగా జూడసాగెను. చలపాక్షి పుష్పహారముల ల్లుటయందు మిగుల చమత్కారముగలది గనుక, రాజలక్ష్మి యామెయల్లిన హారములుదప్ప దక్కినవి ధరింపనొల్లకుండెను. కథలుజెప్పుటయందును, సంగీత మునందును, మిగుల నిపుణురాలు గనుక యామెపని లేనపుడంతయు రాజకుమారునకు వాటినివినుపించుచుం డెను. ఈ విధముగా కాలముగడపుచు కొన్నిదినము లు జరిగినతరువాత రాజలక్ష్మి యొంటరిగానుండు సమ

యంబున చపలాక్షి యామెతో నీవిధముగా సంభా
షింపదొడంగెను.

రాజ:— చపలాక్షీ! పనులన్నియు నయినవా?

చప:— అమ్మా! గృహకృత్యము లన్నియు
ముగిసినవి. ఇకపుష్పము లల్లవలయును.

రాజ:— నీ కింతచమత్కారముగా పుష్పము
లల్లుటెవరు నేర్పిరి?

చప:— అమ్మా! యోధపురమందు మాకొ
కచిన్నయుద్యానముండెను. అందనేక పూలచెట్లుగలవు.
అచటనాకొక దాసియుండెను. అది పుష్పహారము
లల్లుటయందు మిగులచమత్కారి. ఆదాసి ప్రతిది
నము పుష్పములుదెచ్చి హారములల్లుచుండెను. నే
నును పనిలేనపుడంతయు దానిదగ్గరగూర్చుండి హార
ములల్లుట నేర్చుకొంటిని. తల్లీ! వాటినన్నిటిని త
లచుకొనిన కడుపులో కలచినటులుండును.

రాజ:— అమ్మా! యీ లోకములో వెన్నె
లకొన్నిదినములు చీకటికొన్ని దినములుండునటుల,
సుఖములెవరికిని స్థిరముగానిలుచునవిగావు. ఎందరెం
దరు చక్రవర్తులు తమరాజ్యమును బోగొట్టుకొని
కష్టదశలనంది యుండిరి! వారికంటె మనము గొప్ప
వారమా!

చప:— తల్లీ! మాయొక్క సంపద భోయి నందులకు నేనంతవిచార పడలేదు. అమ్మా, పతివియో గముకంటె మించినదుఃఖ మీ లోకమున సతికి లేదుగదా. . కానియట్టివి మీవంటి యవివాహితుల కెటుల దెలియును.

రాజ:— నిజమే, అట్టివి మాబోటి బాలికల కెటులదెలియును. మా కిపుడుగావలసినది యుద్యాన వనములందు చెలులతో వేడుకగా విహరించుట, మే డలయందు నివసించుట, పుస్తకములు జదువుకొనుట, కంటికింపగువస్తువులను జూచుట, యిష్టము వచ్చినవారి ని బహూకరించుట మొదలగునవి.

చప:— అమ్మా, నీవుమనంబున వేఱువిధంబు గా దలంచవద్దు. నేను నీప్రాయంబున వివాహమై యనేకవిషయసుఖనిమగ్ననై యుంటిని. మీ తండ్రి యిప్పటికిని నీకు వివాహము జేయకుండుట విచార కరము. రమణీమణుల కీప్రాయమే మన్మథ క్రీడలయందు దేలియాడుటకు దగినది.

రాజ:— చెలీ నీవునన్ను తప్పదలచితివి. వి వాహముయొక్క తలంపు నామనంబున జనించనే లేదు. నేనింకను బాలను. నాకులోకానుభవము చా లదు. మఱికొంతకాలము నేనవివాహితనై యుండుట

యే మేలని తలంచితిని. ఒకవేళ నాకు పరిణయముగా వలయుననిన నామనంబునకు నచ్చినపురుషుండు లభించ వలదా?

చప:— అమ్మా! నిన్ను గోరి యనేక రాజాధి రాజులు తమపుత్రుల పటములను మీతండ్రికి బంపగా నతడు నీకుబంపినాడని మనచెలులు కమలాలలితలు చెప్పి యాపటములను నాకు జూపిరిగాని, వాటియందొక టిగూడ నామనంబునకు నచ్చలేదు. వాటికిని నీకును నక్కకును నాగలోకంబునకున్నంత తారతమ్యము గలదు.

రాజ:— చెలీ! మనస్సునకింపుగాని సమాచారంబులను గురించి మనము మాటలాడుటెందులకు?

చప:— అమ్మా! మాటవరుసకటులంటినికాని, మనకు లోకములోని సమాచారంబులతోనేమియు నిమిత్తములేదు. అమ్మా, నీవు మనంబునందు నను వేఱు విధంబుగా దలంచనియెడల నీకొక సమాచారంబును దెలిపెదను.

రాజ:— చెలీ! తెలిసిన సమాచారంబును జెప్పినపుడు మనంబులో ననుకొనడమేమున్నది?

చప:— తల్లీ! నేను నిన్నటిదినంబున బజారున కుబోయి వచ్చుచుండగా నొక నవమన్మథాకారుడు

గుఱ్ఱముమీద కూర్చుండి బోవుచుండెను. అతని యందము నీవిజూచిన, యెటువంటి స్త్రీకిగూడ వానిమీద మోహముదయించును.

రాజ:—ఆపురుషుడెవ్వరైనది తెలుసుకొంటివా?

చప:— అప్పుడచటనుండు మనుష్యులను విచారించగా యతడు మంత్రికుమారుండనియు, పేరు రఘువర్మయనియు జెప్పిరి.

రాజ:— అతనితో మనకుబనిలేదు. అతడు కడు దుర్మార్గుడు, జారుడు, చోరుడు, మఱియు మానవుడేయే దుర్మార్గములను జేయసమర్థుడో వాటియన్నిటియందును నతడు సమర్థుడు.

చప:— కన్యకామణీ! తర్వాతివిషయంబులాలకించుము. నేనతనిని జూచినతదుపరి మన చెలికత్తెలతో యతనిగుఱించి విచారించితిని. వారును నీవుచెప్పనటులే నుడువగా, వారివాక్యంబులు నాకు మిగుల వింతగొల్పెను. యెందుకన నంతసౌందర్యవంతుడును, సుకుమారుడును నయిన యతడే యంతదుర్మార్గుడైనచో నింక లోకము నెటుల నమ్మవచ్చుననుకొంటిని. నేనీ సంశయమును బాపుకొనుటకునై యీదినమున బజారునకుబోయినపుడనేకులను విచారించితిని. వారందరు నతడు మిగుల మంచివాడనియు, నతనిశతృవులతని

నగడుబుచ్చుచున్నారనియు, యతడు జారులకును, చో రులకును పత్రికలోనిబల్లెమై యుండుననియు చెప్పిరి. నాకుగూడ నవియే నమ్మదగినమాటలుగా దోచెను. నీకును నతడే సరియయినవరుడనియు, యతనివరించిన నీవు సుఖపడుదువనియు దోచుచున్నది.

రాజ:— ( కోపారుణనేత్రములతో ) ఏమేమి? నన్నాదుర్మార్గుని వివాహమాడుమనియా చెప్పుచుంటివి? నీకు యెక్కువ చనవిచ్చుట నాదియేతప్పు. నీవిదివఱకు జేసిన పరిచర్యకునై నిన్ను మన్నించుచుంటిని. ఇకమీా దట నిట్టిమాటలాడిన నిన్ను దగినటుల శిక్షించెదను.

ఈవిధముగా రాజనందన పలికి తటాలున నచటి నుండి లేచిపోయెను. చపలాక్షియు తన దొలిప్రయ త్నము విఫలమైనందులకు మిగుల వగచుచు, నింటిలో ని బనులను జూచుకొనుటకు వెడలిపోయెను.

## —♦ అయిదవ ప్రకరణము. ♦—

రెండవప్రకరణమున జెప్పబడిన ప్రతాపచంద్రుడు సైన్యమునందుద్యోగము గుదిరినతర్వాత నాశూరశిఖామణి కోటలో నొక యిల్లద్దెకుదీసుకొని యందు నివసించుచుండెను. అతడు తన చాతుర్యమువలన, క్రిందియుద్యోగులయందు వాత్సల్యము జూపుటవలన నందరికిని మంచివాడాయెను. అతడు సద్గుణగరిష్ఠుడును, రాచకార్యములయందు నిపుణుడును నైనందున మహారాజున కతడసిన మిగులబ్రీతి. అతనిని విచారించనిది యే రాచకార్యముగాని, తుదకు స్వకార్యముగాని రామదేవుడు చేయుటలేదు. కాలక్రమమున నతని దగ్గర యనేకమంది స్నేహితులు జేరిరి. వారిలో ముఖ్యుడు సేనాధిపతి కొమరుడు. వీరసేనుడనువాడు. లోకములో సమానప్రతిపత్తిగలవారికి స్నేహము బహుకాలము నిలుచునుగదా? వీరసేనుడు సద్గుణకోవిదుడును, బీదలయందు దయగలవాడును నైయుండెను. ఇతడు తన తండ్రియగు చంద్రసేనునకుగూడ నప్పుడప్పుడు కొన్ని రాచకార్యములయందు సహాయపడుచుండెను. ఇతనికి ప్రతాపచంద్రునకు దేహములు వేరయినను జీవుడొకడుగానే యుండెను.

ప్రతాపచంద్రునిమీద భూపతిచూపు వాత్సల్యమునుగని మంత్రికుమారుని కతనిమీద నసూయబొడమెను. రఘువర్మయు నతని మిత్రులు నతనిని పెక్కుడుములు బెట్టుచుండిరి. తుదకాతనిని జంపవలయుననిగూడ బ్రయత్నపడజొచ్చిరి. అట్టి ప్రయత్నములలో నొకదానిని సీక్రిందనుదహరించెదను. ప్రతాపచంద్రుడు దేవగిరిపట్టణముజేరినది మొదలు ప్రతిదినము సాయంత్రమా నగరమువెలుపలికి వాహ్యాళికై వెడలుటగలదు. ఈసమాచారము రఘువర్మకు, నతనిమిత్రులకును, దెలిసియుండెను. ఒకదినము ప్రతాపచంద్రుడు వచ్చుటజూచి, మంత్రినందనుడు నతనిమిత్రులయందు మువ్వురను జేర్చుకొని మారువేషంబులుదాల్చి యతని నడ్డగించెను. ధైర్యసింహుడగు మన ప్రతాపచంద్రుడుగూడ వెనుదీయక ఖడ్గమును దూసి నిలువబడెను. శత్రువులు నలువురుండినప్పటికి నతడు వారితో కొంతసేపు సరిసమానముగా బోరాడుచుండెను. కాని యొంటరిగా నెంతసేపు బోరాడగలడు! తుదకొక గంటసేపు యుద్ధముచేయునప్పటి కతనిశక్తి తగ్గదొడంగెను.

ఆదినముదయమున నేదోయొక రాచకార్యము నిర్వర్తించుటకు వీరసేను డిద్దరుసిపాయిలను బిలుచుకొని, యాదారినే సమీపగ్రామమునకు బోయియుండెను.

అతడు తిరిగి నగరమునకు వచ్చుట, వారుకోరా డు సమయముననే తటస్థపడెను. అప్పుడతడు వారిని వీక్షించి, యందు ప్రతాపచంద్రుని నతనిశత్రువులు చుట్టు ముట్టియుండుట నవలోకించి, మహాగ్రహాపాద గ్రుడై తన సిపాయిలతోగూడ వచ్చి సాయమై నిలిచె ను. రఘువర్మయు నతని సహచరులు నీ వీరులను జూడగనే పిక్కబలము జూపసాగిరి. ప్రతాపచంద్రు డును, వీరసేనుడును, వారిని పట్టవలయునని, కొంతదూ రము వెంబడించిరి. కాని, యానీచాధములు చిక్కక పరారయిరి. ఆ యుద్ధమునందు ప్రతాపచంద్రునకు గొన్ని గాయములు తగిలినందున, వీరసేనుడు సమీప మునందలి కొలనునుండి నీరుదెప్పించి యాగాయములు శుభ్రపరచి కట్లుగట్టించెను. అటుపిమ్మట వారింటికి బోవుచు నీ క్రిందివిధముగా సంభాషించిరి.

ప్రతాప:— వీరసేనా! నీవచ్చుటవలన నాప్రా ణంబులు దక్కినవి. లేనిచో వారు నన్నీపాటికి తుద ముట్టించియే యుందురు.

వీర:— మిత్రమా! ఇందు నాసహాయమేము న్నది. నీసుగుణంబులవలననే దేవుడు నీశత్రువులయ త్నములను విఫలములగునటుల జేయుచుండును.

ప్రతాప:— సన్మార్గులు తమను గొప్ప జేసుకొని

పొగడుకొనరుగదా. మిత్రమా! నామనస్సాక్షి గా నేనెవరికిని హానిజేసియెరుగను. వారు యెవరైయుందురు? నన్నాదరించుటకు గారణమేమి?

వీర:— చెలికాడా! భూలోకమునందుత్తములను జూచి యోర్వలేనివారుగూడ గలరు. కాని వారి యీర్ష్యాగ్ని వారినే దహించుచుండును. అట్టివారేప్రయత్నమును జేసినను కీడుగలుగునేగాని మేలెన్నటికిని బొందనేరరు.

పరితాప:— మిత్రమా! వారిమొనగాడెవరైనది నీకు దెలియునా?

వీర:— వారు కపట వేషంబులతో నున్నందున యెవరైనది మనోహ్యముగానున్నది గాని, నిదానముగా నాలోచింప నతడు మంత్రియాత్మజుండగు రఘువర్మయనియే దోచుచున్నది.

పరితాప:— అతనికినాకు పగయేమున్నది? వానికి నేనెన్నడును గీడుజేయలేదుగదా.

వీర:— మిత్రమా నీవు సన్మార్గుడవగుటవలన, లోకములో నందరును నీవంటివారేయని తలంతువు. నీవు సజ్జనుడవగుటవలనను, విశేషించి రాజు నీమీద వాత్సల్యము జూపుటవలన, నతనికి నీయందసూయ జనించియుండును. ఆ త డు దుర్మార్గుడు, జా రు డు,

చోరుడు. అట్టివాడు నీవంటి సన్మార్గుడు వృద్ధికివచ్చుట జూచియోర్చునా? కనుక నికమీదట నీవతనిమీద కన్నుగలిగియుండుము.

అని వారిరువురు మాటలాడుకొనుచు దేవగిరి పట్టణముజేరి, యెవరి గృహంబులకు వారుజనిరి. తరువాత కొన్ని దినములకు ప్రతాపచంద్రునికి గాయములుమాని సంపూర్ణారోగ్యవంతుడయ్యెను.

ఇటులకొన్ని దినములు గడచినతరువాత విజయదశిమియను పండుగవచ్చెను. అప్పటికి విజయదశిమి లేక యాయుధపూజ మహారాష్ట్రదేశంబున గొప్పపండుగగా భావింపబడుచుండెను. ఆదినంబునందు రాజకచ్చేరీలన్నియు మూయబడియుండెను. రాజసభామంటపముయొక్క ద్వారంబులకు మామిడి యాకులదోరణంబులు గట్టబడియుండెను. లోపల స్తంభంబులకరటిచెట్లు కట్టబడియుండెను. రాజుగూర్చుండు సింహాసనమును, సభాసదులాసీనులగుట కేర్పాటు జేయబడిన కుర్చీలును, పుష్పంబులతో నలంకరింపబడి, చూచుటకు దేవేంద్రుని సభనుబోలియుండెను.

ఆ దినంబున రామదేవమహారాజు పగలుతొమ్మిది గంటలకభ్యంగన స్నానముజేసి, సభాభవనమునకువచ్చి, సింహాసనముమీద కొలువుదీరి గూర్చుండెను.

బహుమతులుగా నొసంగబడుటకై కొన్నివస్తువులను దెచ్చి సేవకులు సింహాసనము ముందుంచిరి. ఆసమయమునందు ముందుగా రాజబంధువులు వచ్చి రాజునకు నమస్కారములు చేసి, తాము దెచ్చిన నజరుల నర్పించిరి. రామదేవుండును వాటిసందుకొని, తనముందర బెట్టిన వస్తువులను వారివారి యోగ్యతానుసారముగా నిచ్చుచుండెను. అటుపిమ్మట మంత్రియు, సేనాధిపతి మొదలగు నుద్యోగులును, సామంతరాజులును, పట్టణములోని ధనికులు నచ్చటికరుదెంచి, యా నృపాలునకు దమశక్త్యనుసారముగా నజరులనర్పించి, యతనివలన సన్మానింపబడుచుండిరి. ఇటులందరు గూడినతరువాత రాజమంత్రులిరువురును గొన్ని యుపన్యాసములిచ్చిరి. అటుపిమ్మట గొందరు వారవనితలువచ్చి కొంతకాలము నృత్యమాచరించి పాటలుబాడిరి. భూపాలుడును వారికి తగుబహుమతులనిచ్చిపంపెను. పిమ్మట కొందరు కవులు తమ కవితాచమత్కృతిచే నతనిని సంతోషపెట్టిరి. అతడు వారలకనేకాగ్రహారములిచ్చి సంతోషపడుచెను. తరువాత వందిమాగధులు భూపాలుని నతని వంశ్యులను బొగడదొడంగిరి. భూకాంతుడు వారలకనేక దానములు జేసెను. ఈ పనులన్నియు ముగియునప్పటికి

పదిరెండుగంటలగుటవలన నాటిదినంబునకు సభవిరమింపబడెను.

ఆ దినముననే పట్టణము వెలుపల నొక మైదానమందు, పందెములు వేడుకలు జరుగుట కేర్పాటు చేయబడియుండెను. ఆ స్థలంబు పచ్చికబయలుచే గప్పబడి చూచువారికి బహు మనోహరముగా గనబడుచుండెను. ఆ మైదానమునకు ప్రాగ్దిశయందు సన్నని సెలయేరును, దక్షిణమున శృంగారోద్యానములును, నుత్తరమున పైరుపెట్టబడిన తరిభూములును, పశ్చిమమున పచ్చికబయళ్లునుండినందున, యాపరాత్పరుడే వేడుకలను పందెములను జరుపుకొనుటకా స్థలంబు నేర్పాటు జేసెనాయను తలంపనేకులకు గలుగుచుండెను. ఆ మైదానంబునకు పూర్వదిశయందు భూపాలుడు గూర్చుండుటకొక సింహాసన మమర్పబడియుండెను. ఆ రాచగద్దెచుట్టు నున్నతోద్యోగులును, సామంతులు నాసీనులగుటకు కుర్చీలు వేయబడియుండెను. దక్షిణమున రాచస్త్రీలు గూర్చుండి చూచుటకు వసతి యేర్పరుపబడియుండెను. దానికించుక దూరమున స్త్రీలకేర్పాటు జేయబడియుండెను. పశ్చిమోత్తరదిశల నగరమునందలియు, పరిసర గ్రామములందలియు జనులకుగాను బెంచీలు

చాపలు వేయబడియుండెను.

పూర్వకాలమునందు ప్రస్తుతకాలమునవలె వేడుకలు విశేషముగా జరుగడములేదు. మరియొకవిశేషమేమన నిప్పటికాలము వారివలెగాక, పూర్వులకు ఖడ్గయుద్ధములు, మల్లయుద్ధములు ననిన యెక్కువప్రీతి గనుక, ద్రవ్యవంతులనక, దరిద్రులనక యెల్లరును తండోపతండంబులుగా, నియమితకాలమునకు ముందుగనే యచ్చటజేరియుండిరి. ఆచ్చట నలుగురుద్యోగులు కొంతమంది సిపాయుల సహాయముతో యెవరెవరి నెచ్చటెచ్చట గూర్చుండ బెట్టవలయునో యచట గూర్చుండ బెట్టుచుండిరి. తరువాత రాజబంధువులును, రాచస్త్రీలును, మంత్రిసామంతాది యుద్యోగులునువచ్చి వారివారికి నియమింపబడిన స్థలములందాసీనులయిరి. సాయంత్రము మూడుగంటలకు రామదేవుడు యేనుగమీద హౌదాలో గూర్చుండి యచటికివచ్చెను. రాజురాగానే యందరును గౌరవాదరముగా నిలువబడిరి. అంతట నరపాలుడు వారిని గూర్చుండనియమించి, తన సింహాసనముమీద నాసీనుడయ్యెను. వేత్రహస్తులు నెమలి పింఛములతో వీవదొడంగిరి. వందిమాగధులు స్తోత్రములు జేసిరి.

అంతట నృపసత్తముడు చిత్రవర్మనుజూచి కార్యక్రమము ప్రకారము వేడుకలుజరుపుటకై సెలవొసంగెను. అప్పుడు పాఠశాలలో చదువుకొనుబాలురు కొందరు రంగప్రదేశమునందు ప్రవేశించి, కొన్ని స్తోత్రపద్యములు జదివిరి. తరువాత వారిచే కొన్ని పందెములు ( పరుగెత్తుట యెగురుట మొదలగునవి ) జరుపబడెను. వాటిలో గెలిచినవారు రాజుచేబహుమతులందిన తరువాత విరమించిరి. తనుపరి యిద్దరు మల్లులు కారుదున్నలవలె మధ్యరంగమున దుమికిరి. వారి దేహౌన్నత్యమును, శరీరపాటవమునుజూచి, జనులాశ్చర్య పడజొచ్చిరి. వారొకరితో నొకరు పరాక్రమమునుబలుకుచు, తొడలుచఱచుచు మొదిరించినిలిచిరి. రామదేవ మహీపతి ముదలనివ్వగనే, హిమవత్పర్వతమును మేరుపర్వతము డీకొనినటు లొకరితో నొకరు తగులబడిరి. వారిమల్లయుద్ధము మహాభారతమందు వర్ణింపబడిన భీమజరాసంధుల ద్వంద్వయుద్ధమును బోలియుండెను. ఈప్రకారముగా నిరువురును పెనగులాడి పెనగులాడి తుదకొకని నింకొకడు క్రిందబడవైచి మీదగూర్చుండెను. జనులు కరతాళధ్వనులుగావించిరి. పిమ్మట రాజు గెలుపొందినవాని వెండితోడాలతో బహూకరించెను.

అటుపిమ్మట కార్యక్రమము ప్రకారము మంత్రి కుమారుడగు రఘువర్మయును, మన కథానాయకుండగు ప్రతాపచంద్రుడును నిండుకవచధారులై, పొడుగుపాటి యీటెలను కరంబులందు ధరించి, నీల మేఘంబులవలె నుండు నశ్వంబులపై నాసీనులై, కర్ణార్జునులవలె రంగమధ్యంబునకువచ్చిరి. అట్టి సమయంబున నిద్దరుద్యోగులు వారిమధ్యంబునకువచ్చి యీ యశ్వారోహణయుద్ధ నిబంధనల నీవిధముగా ప్రకటించిరి. "ఓవీరులారా, మహాజనులారా, ఈ యుద్ధము జేయువారి రంగమునందు చెరియొక కొనకుబోయి, యీటెల నొకరికొకరు గురిపెట్టి డీకొనవలయును. ఇందులో గుఱ్ఱము మీదనుండి క్రిందబడిన వారోడినటుల తీర్మానింపబడును. ఎట్టికారణములచేతగాని మెడకుపైభాగమున, గురిపెట్టగూడదు, పొడవనుగూడదు. ఈ నిబంధనకు మీరినవాడు కఠినముగా శిక్షింపబడును." అనియీవిధముగ వినిపించిన తరువాత మనయోధులు రంగమునందుచెరియొక కొనకుబోయి యెదురుపోటుగా తమగుఱ్ఱములమీద గూర్చుండి యుండిరి.

ఈవేడుకలు జూడవచ్చిన ప్రేక్షకులు యెవరు గెలుతురోయని డోలాయమాన మానసులై యిరువురి

ని వీక్షించుచుండిరి. స్త్రీలుగూడ యెవరువిజయులగుదురోయని సంశయచిత్తులైయుండిరి. రాచస్త్రీలయందు రాజలక్ష్మి యాయిద్దఱాశ్వికులలో ప్రతాపచంద్రునిజూచుట యిదియేనూతనము. అతడు గుఱ్ఱము మీఁద గూర్చున్న ఠీవియు, కళాపూర్ణమైన ముఖము, నందలి విశాలమగు ఫాలమును, ప్రకాశమానములైనకన్నులును, పొడుగుపాటి నాసికయు, చిరునవ్వులొలుకు పెదవులును, గంభీరాకారమునుజూచి, ప్రథమవీక్షణముననే యామెమనం బాతనియందు! హత్తుకొనియెను. ఆమెయు తన హృదయంబునందతనికి జయము గలుగునటుల భగవంతుని వేఁడుకొనుచుండెను.

అటులీ యిరువురు యోధులు నొకరి నొకరు డీకొనుటకు వీక్షించుచుండగానాభూపాలుడు వారికి సంజ్ఞజేసెను. వారును తమ యీటెల నొండొరులకు గురిపెట్టికొని వారియశ్వంబులను వాయుమనోవేగములతో పరుగెత్తించిరి. ఆవీరులు గలియబడుట జూడ నేడుమీఁరిన యాబోతుల పోల్కినుండెను. వారిరువురును సమానవేగంబుతో వచ్చినందునను, సమాన బలముతో బాడుచుకొని నందునను, యిరువురి యా యుద్ధంబులును తుందునుకలయ్యెను. వారు మరల క్రొత్త యీటెలనుదీసికొని మొదట నిలువబడిన స్థల

మునకుబోయిరి. రామదేవుని సంజ్ఞకాగానే వారు తమ ఘోటకంబుల పరుగెత్తించుకొనివచ్చి తగులబడిరి. మొదటివలెగాక ఫలితములిప్పుడు వేరువిధముగా నుండెను. ఏలననగా వారు గుఱ్ఱముల పరుగెత్తించు నపుడు మాత్రమిరువురును గురి సరిసమానముగనే యుంచుకొనియుండిరి. కాని, సమీపమునకురాగానే రఘువర్మగురి చెదరిపోయి, ప్రతాపచంద్రుని ప్రక్కకుదగిలి, యతనిని గుఱ్ఱముమీదనుండి గఱ్ఱనిత్రిప్పెను; కాని, యతనికిగల యశ్వారోహణ సామర్థ్యమువలనను, యతని నైపుణ్యమువలనను, యతడు గుఱ్ఱముమీదనుండి క్రింద బడకుండునటుల గూర్చుండగలిగెను. రఘువర్మ మాత్రమంత యదృష్టమునకు నోచుకొనలేదు. కారణమేమన ప్రతాపచంద్రుని గురిమాత్రము చెదరక రఘువర్మగుండెలకు సరిగాబోడచుటవలన, నతడు దెబ్బలకు తాళజాలక గిరగిరతిరిగి భూమిమీద బడెను. అటుల క్రిందబడి వెంటనే పైకిలేచినిలువబడి తటాలున కత్తిదూసి యుద్ధమునకు దలపడెను. ప్రతాపచంద్రుడును గుఱ్ఱముమీద నుండి క్రిందికి లంఘించి, తన కరవాలమును దీసికొని యాతని నెదిరించెను. అప్పుడు భూపాలుని యుత్తరువుమీద రాజసభికులు వారిరువురి మధ్యంబునకు వచ్చి చెరియొకప్రక్కకు

ద్రోసికొని పోయిరి. అటుపిమ్మట రామదేవ మహా రాజు ప్రతాపచంద్రుడు గెలిచెనని ప్రకటించెను. జను లందరు కేకలు వేయుచు కరతాళధ్వనులు జేసిరి.

అప్పుడు నృపాలుడు ప్రతాపచంద్రు నచటికి బిలిపించి, మేలయిన యొక యరేబియా తురగమును, మంచి పనితనముగల వెండిపిడిగల యొకఖడ్గమును, స్వహస్తములతో నతనికి బహుమతి జేసెను. అతడు నాకరవాలంబును నడిమికిధరించి, యాయశ్వరాజము నారోహించి, మైదానముచుట్టు తిన్నగానడిపించుచు, నచ్చటికేతెంచిన ప్రేక్షకులనందరిని వీక్షించుచుబోవు చుండెను. అచ్చటనున్న జనులలో కొందరతనినిజూ చి మందహాసము జేయుచుండిరి. కొందరుపొగడచుం డిరి. కొందరాతని యాకారమును, కీవియు, గుఱ్ఱము ను నడిపించుచతురతయు జూచి, యాశ్చర్యపడుచుండిరి. ఇటులతడు తనతురగంబును మందగమనంబున నడిపించు చు, రాజకాంతలుండుచోటునకువచ్చెను. ఆసమయం బున నతడొక లలనామణి తన్నుసాపేక్షముగా వీక్షించు టయు, నతడామెను జూచినపుడాపంకజాక్షి సిగ్గున నధో వదనయగుటయు గనెను. ఆకాంతారత్నము పదునారు వత్సరంబుల ప్రాయంబుగలదియై నిండుజవ్వనంబున న లరారుచుండెను. ఆమెకమలములవంటి నేత్రములును,

యద్దమువంటి వదనంబును, బింబఫలములనుబోలిన యధరమును జూచి రతీదేవియే భూలోకమునకు దిగివచ్చి నట్లుతడు దలచెను. ఆసౌందర్యవతి రాచస్త్రీల మధ్యంబునగూర్చుండి యుండుటచేతను, విశేషించి మహారాజ్ఞి యగు సుశీలప్రక్కననే యాసీనయైయుండుటచే నతడామె రాకొమరితెయైయుండునని తలచెను. ఆసమయంబున నాతనికామెయుండు స్థలంబుదాటి ముందుకుబోవుటకు హృదయంబొప్ప కున్నను, నచటజేరియున్నజనులేమనితలతురోయను లజ్జాభయము లతనిమనంబున ముప్పిరిగొన, నతడుముందుకు సాగిపోయెను. ఇటుల తిరిగివచ్చి రాజునకు వందనంబాచరించి యాతని యానతిపై నొకకుర్చీమీద నాసీనుడయ్యెను.

అప్పటి కపరాహ్ణంబగుటచే నచటికొక దంతావళము గొనిరాబడెను. దానిమీదనొక హౌదా గట్టబడి పుష్పమాలికలచే నలంకరింపబడి యుండెను. అచటనున్న జనులందరు రామదేవమహారాజు నందుగూర్చుండబెట్టి యూరేగింపుతో రాజనగరునకు గొంపోయిరి. దారిపొడవునను వారకాంతలాడుచు పాడుచు బోవుచుండిరి. బాణసంచు విశేషముగా గాల్చబడెను. ఇటుల మహావైభవముతో విజయదశమి ముగిసెను. ఎవరి గృహంబులకు వారరిగిరి.

---

## ఆరవ ప్రకరణము.

ఇటు లూరేగింపు ముగిసినపిమ్మట ప్రతాప చంద్రుడతని గృహంబునకరిగి, కాల్యంబుల దీర్చుకొని, భోజనతాంబూలాదిక్రియలు ముగించుకొని, బయటవేదికపై గూర్చుండియుండెను. అట్టిసమయంబున సేనాధిపతి కొమారుండైన వీరసేనుండచటికేతెంచి, యతని ముదలపై నాసీనుడై, యిటుల సంభాషింప మొదలిడెను.

వీర:— మిత్రమా! ఈ దినంబున నీకు గలిగిన విజయంబునకు నేను సంతోషభరితుండనైతిని.

ప్రతాప:— సచివపుత్రుడా! నీ పరామర్శనకు సంతోష చిత్తుడనయితినిగాని జయాపజయము లీశ్వరుని యాధీనములుగాని, మనయత్నమేమియు లేదుగాన, మతిమంతు లందులకెవ్వరు నుప్పొంగరు.

వీర:— మిత్రమా! ఈ పట్టణంబున రఘువర్మతో సరిసమానముగా ద్వంద్వ యుద్ధము జేయువాడు నిన్నటివఱకు నెవడును లేనందున, నతడు కడు గర్వించియుండెను. కాని నిన్నటియుద్ధమువలన నాతనికి గర్వభంగమయినది. మీ వంటిశౌర్య సంపన్నుని నేనిదివరకు జూచియెరుగను. ప్రతాపా! చెప్పిన

నమ్ముదువో లేదో కాని, వేడుకలు జూడవచ్చి
న వారిలో నిన్ను శ్లాఘింపని వాడే లేడు.

ప్రతాప:— నెచ్చెలీ! నీవు నా శక్తిని గోరంతలు కొండంతలుజేసి పొగడుటచే నామనమునకు మిగుల లజ్జగా నున్నది. నేను నీవునుతించునంతటిస్తుతి పాత్రమునకు దగను.

వీర:— మిత్రమా! నీ వెల్లప్పుడును నిన్ను తగ్గించుకొనియే మాటలాడుచుందువు. నెచ్చెలీ! నాకిప్పుడు కొన్ని యూహలు మనంబున బొడగాంచుచున్నవి. అవేవియన, లోకంబునందే వస్తువునందు నన్నియు సుగుణములే యుండనటుల, ఈ దినము నీకుగలిగిన జయమునందుగూడ నాకు గొన్ని దుర్గుణములు కనబడుచున్నవి. అందు మొదటిది నీకు రఘువర్మకును వైరము మరింత వృద్ధియగును.

ప్రతాప: వీరసేనా! మనమేమియు వానికి మనఃపూర్తిగా ద్రోహము చేయలేదుగదా. ఇపుడు వాడిట్టి నిష్కారణ వైరంబు మనంబున నుంచుకొనినయందుకు మనమేమి చేయవచ్చును. కాని దైవబలంబును మీ కృపయు పూర్ణముగానున్న నేను వానిని లెక్కగొనను.

అని యీ విధముగా కొంతతడవు ముచ్చట

లాడి సేనాధిపతినందనుడు ప్రతాపచంద్రు సెలవుబడసి తన గృహమునకేగెను.

అటు పిమ్మట ప్రతాపచంద్రుడు తన శయన గృహంబునకరిగి శయనించెను. కాని, యాతనికి నిద్రపట్టలేదు. ఆహా! ఏమికామ మహాత్మ్యము. దాని గాలిసోకిన వారిదరికైన నిద్రాదేవి రావెఱచును గదా. మన ప్రతాపచంద్రుడు తల్పంబుమీద నటునిటు బొరలాడుచు నిటుల తలపోయసాగెను. " ఈ దినము రాజస్త్రీప్రేక్షకుల మధ్యజూచిన సౌందర్యవతి యెవరైయుండును. ఏమి యారూపము! ఆ లావణ్యము! ఆమె శృంగారవిలాసము ముందర దేవతా కాంతలుగూడ నామె కాలిగోటికి దులదూగనప్పుడు మర్త్యాంగనల సంగతి వేఱుచెప్పనేల. ఇవన్నియు జూడగా నారమాలలామ వేదజడుడగు బ్రహ్మదేవునిచే సృజింప బడలేదనియు శృంగారాలంకారుడగు మన్మథుడే తనచాతుర్యంబును లోకంబునకు వెల్లడిజేయ నామెను సృష్టించియుండుననియు నామనంబునకు దోచుచున్నది. ఆహా, ఏమినాధైర్యము! పరులనాశ్రయించియుండు నేనెక్కడ, మహారాజాధిరాజ తనయారత్నంబగు నా నారీశిరోమణి యెక్కడ. ఇదివర కెందరెందరు నృపశిఖామణు లామెను తనపుత్రిల

కిమ్మని వార్తల నంపియుండిరి. వారినందరిని తిరస్కరించిన యా కాంతారత్నము, వారికాలిగోటికిగూడ తులతూగని నన్ను వరించునా! వరింపదు. వరింపదు. ( ఇంచుక సేపాలోచనాపరుడై ) ఆమెను బొందని యెడల నే నెటుల జీవింపగలను. ఎటులయినను నా ప్రాణంబుమీద నాశ వదలుకొనవలసినదేనా. కాని నాకొక సమాచారంబిప్పుడు స్మరణకు వచ్చుచున్నది. ఆ నారీశిరోమణికి నాయందిష్టము లేనియెడల నాదినము సాయంతనము మైదానమునందు నావెస సాభిలాషములగు దృష్టులతో నెందులకు వీక్షించినది. నేనాపంకజాక్షివంక జూడగనే యెందులకు బిడియముతో తలవంచుకొనినది. ఇవన్నియు జూడ నామెగూడ నన్ను మోహించునటుల గనబడుచున్నది. అన్నియు నిదానము మీదటగాని బయలుపడవు. నేను మాత్రము నా చాతుర్యము వలన నా మోహతాప మడంచుకొనవలయును. ఈ సమాచారము భూభర్తకు దెలిసిన నా పురోవృద్ధికి భంగము కాగలదు" యని తనస్వాంతంబున నిశ్చయించుకొని తెల్లవారుజామువఱకు మదనునికి జాగారము జేసి యప్పుడు కొంచెము నిద్రపట్టగా నతని నేత్రములు మూతబడెను.

ఆ దింబుననే రఘువర్మ పందెమునందోడిపోయిన తరువాత విన్నబోయిన ముఖంబుతో నచట నిలువ నేరక, తిన్నగా తన గృహంబునకుబోయి సుమారు తొమ్మిది గంటలకు భోజనము చేసుకొని, తమ సంకేతస్థలంబగు బౌద్ధాలయమునకుబోయి, తమ స్నేహితులకొఱకు నిరీక్షించుచుండెను. కొంతసేపటికి వారును నొకరొకరేవచ్చి తమయేలికను గలిసుకొని, విన్నబోయిన యాతని ముఖమును వీక్షించి, మనంబున గుందుచు నీ విధముగా నాతని పరామర్శించిరి.

సీలుడు:— ప్రభురత్నమా! మీ కీ దినంబున గలిగిన యవమానంబునకు మే మందరము గుందుచున్నారము. జయాపజయములు భగవద్ధీనములు గాని మనయత్న మేమియు నఁలేదు.

రఘు:— మిత్రమా, అతడుతప్ప సన్యులచే నోడింపబడియున్న నేనంత వ్యసనపడియుండను. ఆనీచాధముడు నృపవరునిచేనందు బహుమానములుజూచియు, నంతకంటే నితరులవలన స్తోత్రముచేయబడుటవినియును, నాకు మనంబు గలచినటులున్నది. కాని గతజలసేతుబంధనమునకునై బుద్ధిమంతులెవరును నాలోచింపరు కనుక యీప్రశంస వదలి వేఱుప్రస్తావమునకు దిగు

దము. మిత్రమా! నీలా! మనమానాడిచ్చట గలిసి పుడు రాకుమారినన్ను మోహించునటుల జేయుటకు నీభార్యను నియోగించెదనంటివిగదా. అందెంతమా త్రము సఫలీకృతమనోరథుడ వైతివో తెలుప వల యును.

నీలుడు:— దేవా! నేనాదినంబున మీాసన్ని ధినుండి వెడలి నాముద్దుల పత్నికి దాసివేషము వేయిం చి, రాజనందన యొద్దకంపితిని. నాటినుండియు నది నాకనులబడలేదు; కాని యీాదినము సాయంత్రము నే ను పందెములు జరుగుమైదానము నందొకచోటగూ ర్చుండియుండగా, నాదగ్గరకువచ్చి రహస్యముగా "నే నీదినము నిశీథసమయంబున దేవాలయమునకు వ చ్చి మిమ్ములను గలుసుకొని సర్వమును నివేదించెద" నని చెప్పి వెడలిపోయెను. అదియు నీపాటికి వచ్చు చునేయుండును.

అని వారీవిధముగా మాటలాడుచుండగనే చపలాక్షియు నచ్చటికేతెంచి యమాత్యనందనున కు నమస్కరించి నిలువబడియుండెను. రఘువర్మయు నప్పుడతిని గూర్చుండనియోగించి, యీావిధముగా ప్ర శ్నించెను.

రఘు:— చపలాక్షీ! నీకు నియోగింపబడిన

కార్య మేమిజేసితివి? రాజనందన నన్ను వివాహమా డుటకొప్పుకొనినదా?

చపలాక్షి:— మంత్రినందనా, నేను నాపతియాజ్ఞనొదల దాల్చి రాకుమారి యొద్దకుజని, యొకానొక కల్పితపుకథజెప్పి వారు నన్ను నమ్మునటులొనరించి, కపటంపు నేర్పుల నేర్చి యామెకు నాయందు దయగలుగునటులజేసి, యామెవలన నొకదాసిపని సంపాదించి, నాచాతుర్యమువలన యామెమన్ననల బడయుచుంటిని. ఈ కరణి కొన్నిదినములు గడచిన తర్వాత నొకానొక సమయంబున నామె యొంటరిగానుండుటనుజూచి, ప్రస్తావ వశంబున మీ సమాచారంబునుదెచ్చి మిమ్ముల బొగడితిని. ఆమెయు నా మాటలకు దనకు గోపముజనింప, నేత్రములు చింతనిప్పులవలె ప్రకాశింప, భయముచే శరీరము గడగడవడంక, మాటలుతడబడుచు, "నీవాదురాత్మునిపేరు నెత్తిన కఠినముగా శిక్షింపబడుదు" వని నన్నుతీవ్రముగా మందలించెను. నేనేమియు చేయునదిలేక యూరకుంటిని. ఈ దినము సాయింత్రము వేడుకలు జరుగు మైదానమునందు ప్రతాపచంద్రుని రూపకౌశలమును గనుగొని యాతనియందు మక్కువగలిగి యుండునటులనాకు దోచుచున్నది. అచ్చట జరిగిన

సమాచారములన్నియు దాచక విన్నవించియున్నాను. మీరేమి యుత్తరువిచ్చిన దానిని నెరవేర్చుటకు సిద్ధముగా నున్నాను.

రఘువర్మ:— నారీరత్నమా, నీయందేమియు లోపములేదుకాని నాయదృష్టవిహీనతకు నీవేమి జేయగలవు. నాకీ ప్రతాపచంద్రుండన్నింటియందును దాయాదివలె నడ్డపడుచున్నాడు. కానిమ్ము; వానిసమాచారంబు నిధానంబుగా నాలోచన జేయవచ్చును. మిత్రులారా, ప్రస్తుతము రాజపుత్రి నెటుల మోసగించి మన కార్యము నెఱవేర్చుకొనవలయునో మీరాలోచించి మీయభిప్రాయములను దెలిపిన నటులనే జేయుదును.

నీలుడు:— దేవా, మీకంటే మాకెక్కుడు లోకానుభవముగలదా? మీరు మాయాలోచన నడిగినపుడు మేమువిన్నకుండుట ధర్మముకాదు. కనుక నాకుదోచిన యుపాయమేమన, రాజాంతఃపురములో మన మీరాత్రి బ్రవేశించి యాకాంతా రత్నము నామెశయనించియుండు హంసతూలికా తల్పముతో గూడ నెత్తుకొనివచ్చి, యిచ్చట బంధించి, క్రమముగా నామెను నయమున భయమున లోబఱచుకొనుట మంచిది.

రఘు:— చెలికాడా, నీయాలోచనగొప్పదగిన దేకాని, రాజాంతఃపురములు శూరులగు రాజభటుల కాపుదలలోనుండును. ఎటువంటి వారికిగాని యందుప్ర వేశించుట దుర్ఘటము. రంగా, నీయోజన జెప్పుము.

రంగడు:— రాజుబిడ్డ ప్రతిదినము కోటనాను కొనియుండు దేవాలయమునకు చేటీపరివృతయై పూజా ర్థమువచ్చుచుండును. మనమట్టిసమయంబున నిందు దాగియుండి యామెనెత్తుకొనివచ్చిన సరిపోవును.

రఘు:— రంగా, ఆలలనామణి దేవాలయం బునకు పగటికాలమునవచ్చును. మఱియు నాదేవా లయము రాజోద్యోగులుండు గృహంబులమధ్యంబుననున్న ది. మనమట్టిసమయంబున నాపనికి పూనుకొంటిమే ని యాయుద్యోగులు మనపనికి విఘ్నమాపాదించుట యేగాక మనలను బంధించి చెఱసాలయందుంచెదరు. గోవిందా నీవేమిపాయమూరసితివి?

గోవిందు:— అమాత్యనందనా, మనమీచప లాక్షినిగాక మఱియొక దాది నీపనికి నియోగించి సా మంబున ప్రయత్నము జేయుటయే మేలని నామనంబున కు దట్టుచున్నది.

రఘు:— గోవిందా, తనమనంబున వేఱొకరిని మోహించిన యానాతి సామంబున నన్ను మోహించున

నుట కలలోనిమాట. మనచపలాక్షికి మించిన చమత్కారముగలనారీమణి సామాన్యముగా స్త్రీలయందుండుటరుదు. అదియే యామెను వంచించలేనపుడు మిగతవారితో సాధ్యమగుననుట మనము నమ్మదగినదిగాదు. కనుక యీయుపాయ మక్కరకురాదు. నందా, నీవేమి యోచించితివి.

అపుడు నందుడు తనయాలోచన నచటనున్నవారితో రహస్యముగా నుడువగా, వారాయాలోచన బాగున్నదని సంతోషంబున తలలూపి యాతనితెలివికి మెచ్చుకొనిరి. రఘువర్మయు నాతనిశ్లాఘించి యతనినే యాపనిని నెరవేర్చుటకు నియోగించెను. తరువాత నామంత్రి కుమారుడు మిగతవారు జేయవలసిన కృత్యములను వారికినియోగించి, నీలునితో చపలాక్షిని రాజనగరువరకు సాగనంపి వచ్చునటులుత్తరువు జేసి, శయనమందిరమునకుబోయెను. నీలుడును చపలాక్షిని బిలుచుకొనిపోయెను. మిగత మువ్వురు నచ్చటనే వస్త్రములు బరచుకొనిశయనించిరి.

ప్రథమభాగము సమాప్తము.



# వి ష కే స రి

—o—

నీతిసంధానితమగునవల!　　　భక్తి ప్రధానమగునవల!!

చదువరులారా!

ఏమట్లు పెదవి విరచెదరు! నవలలపై గలిగిన జుగుప్సచే తనా? నవలయన్నంత మాత్రముననే మీరింత చులకనగచూడతగునా? నవలలను పేరుతో ప్రకృతము వెలువడునవన్నియు సామాన్యముగ నీతిరహితములుగను రసరహితములుగను, ఒకమారు చదివినపిదప పిప్పివలె పాఱవేయదగినవి వెలువడుచున్నవి. కాని మా యీవిషకేసరి యట్టిదికాదు. నవలయందెటుచూచినను, రసభంగములేకుండ, మీదు మిక్కిలి పోషకముగనుండునటుల భక్తిరస మొలికింపబడినది. నీతులు పుంఖాను పుంఖములుగ చేర్పబడినవి. ప్రబంధముల శైలితో నాధునిక కథాసంవిధానముల మేళవించి విరుపు కనబడనట్లతికింపబడినది. ఈ గ్రంథమునుచదువువారికి పింగళిసూరన్నగారి కళాపూర్ణోదయము జ్ఞప్తికివచ్చుచుండును. పూర్వమునుండి యిప్పటివరకు ప్రబంధరూపముననుండు నవలయిదియొక్కటే. ఇట్టివి మనకరుదుగ లభించుచుండును. కానత్వరపడుడు.

వలయువారు:—

జె. ఆదినారాయణరెడ్డి,
జూటూరు.
తాడిపత్రి తాలూకా,
అనంతపురం జిల్లా.

(లేక)

జె. రామచంద్రారెడ్డి,
కోడూరు.
తాళ్లప్రొద్దుటూరు పోష్టు.
జమ్మలమడుగు తా॥ కడపజిల్లా

